# రామ్ శ్యామ్‌లను బంధించారు !
























5 పండ్ల సువాసనలలో
రాస్ప్‌బెరి, నిమ్మ, నారింజ,
అనాస, మోసంబి.




నోరూరించే, మనసుదోచే
మైమరపించే

## పార్లే
## పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

everest/917/PP-tl

# వనిత

పలువురు వనితా పాఠకులు పంపిన సూచనలను పరిశీలించి, వారి కోరికల మేరకు రూపొందింపబడుతున్న

## వనిత

జూలై మాసం నుంచి వెలువడుతుందని తెలియజెయ్యడానికి సంతోషిస్తున్నాము. తొలి సంచిక జూన్ మాసాంతంలోనే మార్కెట్‌లో వుండగలదు!

**ప్రతి నెలా 1 వ తేదీ 15 వ తేదీలకు వెలువడే ఈ పక్ష పత్రిక వెల ఒకరూపాయి**

సంవత్సర చందా 24 రూపాయిలు

అందమైన ఆఫ్‌సెట్ ముద్రణలో ఆకర్షణీయంగా రూపొందింపబడుతున్న స్త్రీజన పక్ష పత్రిక

## వనిత

చందా వివరాలకు: డాల్టన్ ఏజెన్సీస్ చందమామ బిల్డింగ్స్: మద్రాసు – 26.

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["ముగ్గురు విలుకాళ్లు"] బూర్లె నాగేశ్వరరావు రచన.

మనుషులు పరిస్థితులతో బాటు మారిపోతారు. కష్టాలలో ఉన్నప్పుడు వాళ్ళకు ఇతరుల నుంచి లభించిన సహాయం, కష్టాలు తొలగగానే మరుపుకు వస్తుంది. సుఖాలు తమ స్వప్రయోజకత్వంతోనే సమకూరినట్టు అనిపిస్తుంది. రాముడి సహాయంతో వాలిని తొలగించి, తన కష్టాలు గట్టెక్కించుకున్న సుగ్రీవుడు, సుఖాలలో ఓలలాడుతూ రాముడి మాటే మరిచాడు.

సంపుటి 56 ఏప్రిల్ '75 సంచిక 4





22

వంచకుడి కథ

కోసలదేశానికి రాజధాని అయిన అయోధ్యానగరంలో సురథుడు అనే మేటి రాజు ఉండేవాడు. ఆయన కింద వందల కొద్దీ సామంత రాజ్యాలు ఉండేవి.

ఒకసారి అటవీశాఖా పాలకుడు అతి వేగంగా రాజధానికి చేరుకుని, రాజుతో ఇలా అన్నాడు:

"మహారాజా, వింధ్యకుడు అనే విద్రోహి నాయకత్వాన ఆటవికజాతులన్నీ తిరుగుబాటు చేశాయి. వాళ్ళ తిరుగుబాటును అణచటం నా వల్ల కాలేదు గనక తమరే ఆ పనికి పూనుకోవాలి."

అప్పుడు రాజు, తిరుగుబాటును అణచివేసి, తిరుగుబాటు దార్లను శిక్షించటానికి తన మంత్రిని, బలభద్రుడనే ప్రజ్ఞాశాలిని, పంపాడు.

బలభద్రుడు బయలుదేరి వెళ్ళిపోయిన అనంతరం, గ్రీష్మకాలం చివరలో అయోధ్యకు ఒక దిగంబర సన్యాసి వచ్చాడు. అతను అడిగిన వారందరికీ భవిష్యత్తు చెప్పి, జాతకాలు వేసి, గుప్తంగా ఉంచిన పేర్లు తెలుసుకునీ కొద్ది రోజులలో నగరవాసులందరి మన్ననలూ పొందాడు.

ఈ సన్యాసిని గురించి చాలా విని, రాజు కుతూహలం కొద్దీ అతన్ని రాజభవనానికి ఆహ్వానించి, "అయ్యా, మీరు మనసులో మాట చెప్పగలరట, నిజమేనా?" అని అడిగాడు.

"నేను ఎన్నిచోట్ల ఏమేమి చేశానో వాకబు చేస్తే మీకే తెలుస్తుంది," అంటూ సన్యాసి, తాను చేసిన ఘనకార్యాలన్నీ చెప్పి, రాజుకు విస్మయం కలిగించాడు.

రాజు ఆ సన్యాసికి దేవిడీ ఆవరణలోనే ఒక మఠం ఉండటానికి ఇచ్చి, అతన్ని రోజూ పిలిపించుకుంటూ ఉండేవాడు.

ఒకరోజు సాయంకాలం సన్యాసి రాజ భవనానికి వచ్చి, "రాజా, నీ కొక శుభ వార్త చెబుతాను. దేవతలందరూ నన్ను మరీ మరీ బలవంత పెట్టగా, నేను ఇవాళ ఉదయం నా భౌతికదేహాన్ని మఠంలో విడిచిపెట్టి, సూక్ష్మశరీరంతో స్వర్గానికి వెళ్ళాను. దేవతలు మీ క్షేమసమాచారాలు అడగమని నాతో అన్నారు," అన్నాడు.

ఈ మాట విని రాజుకు అంతులేని ఆశ్చర్యం కలిగి, "మహాత్మా, మీరు స్వర్గానికి ఎలా వెళ్ళారు?" అన్నాడు.

"మహారాజా, అది నాకు ఖేలా మాత్రం కాదా? నేను రోజూ స్వర్గానికి వెళుతూనే ఉంటాను," అన్నాడు సన్యాసి.

రాజు అమాయకత్వం కొద్దీ అయితేనేం, సన్యాసికి గల అనేక శక్తులను ప్రత్యక్షంగా చూసి ఉండటం చేత అయితేనేం, సన్యాసి చేసిన ఘనకార్యాలను గురించి విని ఉండటం చేతనైతేనేం, ఈ మాటలు నమ్మాడు. ఆయన రాచకార్యాలు మానుకుని, తన రాణి గురించి కూడా లక్ష్యం లేకుండాపోయి, అస్తమానమూ ఆ సన్యాసిని పెట్టుకుని, స్వర్గలోక వార్తలు వివరంగా అడిగి తెలుసుకోసాగాడు.



ఇంతలో, ఆటవిక జాతుల తిరుగుబాటును అణచి, బలభద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను రాజధానిలో అడుగుపెడుతూనే, రాజుగారు సన్యాసి వాడి చేతి కీలుబొమ్మ అయిపోయాడనీ, దర్బారు చెయ్యటం లేదనీ, మంత్రులను కలుసుకోవటం లేదనీ విన్నాడు. అతను రాజభవనం ప్రవేశించి దర్బారు నిర్జనంగా ఉండటమూ, మంత్రులుండే చోట ఎవరూ లేకపోవటమూ చూశాడు. ఒక గదిలో రాజూ, సన్యాసీ ఏకాంతంగా కూర్చుని అతనికి కనిపించారు. సన్యాసి రాజుకు ఏదో రహస్యంగా చెబుతున్నాడు; రాజు వికసించిన ముఖంతో సన్యాసి

మాటలను గ్రోలుతున్నాడు. ఆయన బలభద్రుడి రాకను గమనించలేదు.

తొలి చూపులోనే మంత్రికి పరిస్థితి అర్థమైపోయింది. అతను మహారాజు ముందు సాష్టాంగపడి, "మహారాజా, జయం! జయం!" అన్నాడు.

అతను వెళ్ళిన పని ఏమయినదీ కూడా అడగకుండానే రాజు, "మీకు ఈ మహాత్ముడు తెలుసునా?" అని సన్యాసిని చూపుతూ అన్నాడు.

"ఎందరో మహాపురుషులుగా తమ శిష్యులను తయారు చేసిన ఈ మహనీయుణ్ణి గురించి తెలియకేం? వీరు తరుచుగా స్వర్గానికి కూడా పోయి వస్తూంటారని విన్నాను. నిజమేనా?" అన్నాడు బలభద్రుడు.

"అందుకు సందేహమా?" అన్నాడు రాజు. తనను గురించి మంత్రి ఇంత గొప్పగా చెప్పినందుకు ఉప్పొంగిపోయి సన్యాసి, మంత్రికి మరింతగా తనపై గురి ఏర్పడేటట్టు చెయ్యాలని, "కుతూహలం ఉన్నట్టయితే మంత్రిగారు ఆ సంగతి స్వయంగా చూడవచ్చు." అంటూ తన మఠంలోకి పోయి, తలుపు గడియ పెట్టుకున్నాడు. కొన్ని నిమిషాలు గడిచినాక మంత్రి రాజుతో, "వారు స్వర్గం నుంచి ఎప్పుడు తిరిగి వస్తారు?" అన్నాడు.

"అంత తొందర దేనికి? వారు భౌతిక దేహాన్ని మఠంలో వదిలి, సూక్ష్మదేహంతో స్వర్గానికి వేంచేశారు," అన్నాడు రాజు.

"అదే నిజమైతే, కట్టెలూ, నిప్పు తెప్పించండి. నేను మఠాన్ని తగలబెట్టేస్తాను," అన్నాడు మంత్రి.

"దేనికి?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో.

"దేనికని అడుగుతున్నారా, మహారాజా? ఈ కట్టెలాటి శరీరం కాలిపోయిన మీదట, వారు సూక్ష్మ శరీరంతోటే తమ వద్దకు వస్తూ ఉంటారు. అందువల్ల ప్రపంచమంతటా తమ కీర్తి వ్యాపిస్తుంది. ఈ సందర్భంలో మీకు నాగకుమారుడి కథ చెబుతాను," అంటూ మంత్రి ఇలా చెప్పనారంభించాడు.





# విచిత్రకవలలు

## 10

[ గడ్డపువాడి దగ్గరకు పోయిన రాక్షసుడు, వాడి ద్వారా కవలసోదరులు తమను మోస గించారని తెలుసుకున్నాడు. సుహాసిని సహాయంతో సంధ్యా, నిశీధులకు మామూలు రూపాలు వచ్చాయి. రాక్షసుడి భూగృహం గురించి సుహాసిని వాళ్ళకు చెప్పింది. అందులో ప్రవేశించేందుకు కవలసోదరులు పథకం వేయసాగారు. తరవాత—]

తమ వద్ద వున్న భస్మాలూ, అంజనాలూ రాక్షసుడి భూగృహంలో పని చెయ్యవని తెలుసుకున్న తరవాత, కవల సోదరులు వేరే మార్గం ఏమిటా అని చర్చించుకో సాగారు. ఆ సమయంలో వాళ్ళకో సందేహం కలిగింది: "ఈ రాక్షసుడు ప్రపంచంలో ఎక్కడెక్కడి కవలలనూ యిట్టే పసిపట్టి ఎత్తుకు వస్తాడుగదా! ఇంతకాలం అయినా వాడు మన జోలికి రాకుండా వూరుకొనటానికి కారణం ఏమై వుంటుంది ?"

మర్నాడు వాళ్ళు రాజకుమార్తెలను కలుసుకున్నప్పుడు, ఉదయనుడు తమకు కలిగిన యీ సందేహాన్ని వెల్ల డించే సరికి, వాళ్ళు ఆశ్చర్యపోయారు. "నిజమే సుమా! మాకు యింతవరకు యీ సందేహమే కలగలేదు. బహుశా ఒక కారణంవల్ల వాడు మీ జోలికి



రాకుండా వుండి వుంటాడని యిప్పుడు నాకు తోస్తున్నది. ఐతే...." అని ఊరు కున్నది సుభాషిణి.

"ఫరవాలేదు, చెప్పు. నీవు ఊహిం చిన కారణమే నిజమైతే, తగు జాగ్రత్తలో వుండవచ్చు కదా," అన్నాడు నిశీధుడు.

అప్పుడు సుభాషిణి, "ఏమీ లేదు. ఏ విధమైన అవయవ లోపమున్నా, ఆ కవలలు రాక్షసుడి బలికి పనికిరారు. బలి ఇవ్వబోయే సమయమందు ఈవిషయాన్ని వాడు బాగా పరిశీలిస్తాడు. చూడగా మీకు అలాంటి లోపాలేవీ, మా పుట్టుకు కని పించ లేదు. కనుకనే యిలా మిమ్మల్ని అడగటానికి జంకుకలిగింది." అన్నది.

ఇది వింటూనే కవల సోదరులు ముగ్గురూ ఒక్కసారిగా, "నీకు సరియైన సందేహమే కలిగింది," అన్నారు.

తర్వాత ఉదయనుడు, పుట్టుకతో తమ చూపుల విషయంలో ఎలాంటి లోపా లుండేవీ, ఆ తర్వాత అరణ్యంలో వున్న గడ్డపువాడి పుణ్యమా అంటూ ఆ లోపాలు ఎలా తొలగిపోయిందీ రాజకుమార్తెలకు వివరంగా చెప్పాడు.

వాళ్ళు యిలా మాట్లాడుకొంటుండగా, రాక్షసుడి రాక తెలిపే సుడిగాలి ప్రారంభ మైంది. వెంటనే రాజకుమార్తెలు కొలను లోనికి వెళ్ళిపోయారు. కాని, పాపం యీసారి కవలసోదరులు తప్పించుకోలేక పోయారు. ఉదయనుడు తన వద్ద వున్న భస్మం తీసి సరీగ్గా మీద చల్లుకోబోయే సరికల్లా, రాక్షసుడు అమాంతం ప్రత్యక్షమై, వాళ్ళ ముగ్గుర్నీ తన గుప్పిటిలో చిక్కించుకొన్నాడు.

కవల సోదరులు లోలోపల భయంతో గజగజ వణికిపోతున్నా, పైకి మాత్రం ధైర్యంగానే వున్నారు.

రాక్షసుడు వాళ్ళను, "ఎవరు మీరు? ఈ నా రహస్య ప్రదేశానికి ఎలా వచ్చారు? నిజం చెప్పండి, లేదా యింతకు ముందు వచ్చినవాళ్ళ గతి ఏమయిందో అదే మీకూ అవుతుంది." అని గర్జించాడు.

అందుకు ఉదయనుడు, "నిజమే నయ్యా, ఇక్కడికి రావటం కష్టమనీ, ఎంతో ప్రమాదకరమనీ, తీరా యిక్కడికి వచ్చాక కాని మాకు తెలియనే లేదు. ఐనా మేము ప్రాణాలకు తెగించి వచ్చాం కనుక, మేము చెప్పేది విని, నీ యిష్ట మొచ్చినట్టు చేసుకో," అన్నాడు.

"ఓహో! పిట్ట కొంచెం, కూత ఘనం—అన్నట్టుందే మీ వాలకం చూడగా! మా తమ్ముణ్ణి టోపీ వేసింది మీరే కదూ? సరే, అసలిక్కడికి యిలా దొంగతనంగా ఎందుకొచ్చారో చెప్పండి ముందు," అని గద్దించాడు రాక్షసుడు.

"అదే పొరపాటు. మేము దొంగ తనంగా రాలేదు. అలా రావలసిన అవసరం మాకు లేదు. మేము వచ్చిన పని ఏమిటీ అంటే...." అని ఉదయనుడు ఏమో చెప్పబోతుండగా, "ఏమిటీ ఏముంది? నాకు టోపీ వేయటానికే," అనే మాటలు వినిపించినై.

కపల సోదరులు ఆ మాటలు వచ్చిన దిక్కుకు తిరిగి చూసేసరికి, మొట్ట మొదటగా తాము ఎవరినైతే మోసపుచ్చి గడ్డపువాడి దగ్గరకు పంపారో, ఆ రాక్షసుడే తమవైపు చరచర నడిచి వస్తూండటం కనుపించింది.

రాక్షసుడు వస్తూనే, "అన్నా, వీళ్ళ సంగతి యిక నేను చూచుకుంటాను. కాలం వృధా పుచ్చకు. నీ వేటకి నువ్వు పో," అన్నాడు.





తమ్ముడు ఎప్పుడైతే యిలా అన్నాడో, అప్పుడు రాక్షసుడు, "ఇదేదో పెద్ద గాథ లాగా వున్నది. వీళ్ళు మా తమ్ముడికి తెలిసినవాళ్ళుగానే కనిపిస్తున్నారు. కనుక వీళ్ళ సంగతి వాడే చూచుకోవటం మంచిది," అనుకుంటూ తిరిగి గద్ద రూపంలో రివ్వున ఆకాశ మార్గాన వెళ్ళి పోయాడు.

ఆ వెంటనే రాక్షసుడు, కవల సోదరులను వెంటబెట్టుకుని, తను కాపలా కాసే భవనంలోకి తీసుకుపోయాడు. వాళ్ళని సావకాశంగా కూచోబెట్టుకుని, "అబ్బాయిలూ! గద్దపువాణ్ణి టోపీ వేశారు. నన్ను టోపీ వేశారు. ఇప్పుడు మా అన్నను టోపీ వెయ్య జూచారు. కాని, పాపం మీ ఆటలు సాగక, నా చేతిలో చిక్కి పోయారు. గద్దపువాడి దగ్గిర మీరు కాజేసిన అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ అన్నీ అక్కడ పెట్టండి. తర్వాత తక్కిన సంగతులు మాట్లాడు కుందాం," అన్నాడు.

పాపం, ఏమి చేస్తారు కవల సోదరులు? తప్పనిసరిగా ఆ వస్తువులన్నీ అక్కడ పెట్టివేశారు. అప్పుడు రాక్షసుడు, "అబ్బాయిలూ! ఇంతకాలంగా యిక్కడ కాపలా కాస్తున్నాగాని, నన్ను తప్పించుకు లోపలికి పోయినవాళ్ళు ఒక్కరూ లేరు. ఎవరు వచ్చినా నా చేతిలో చిక్కిపోయి, శిలా ప్రతిమలుగా మారిపోవలసిందే. అదిగో చూడండి, వాళ్ళంతా యింకా ఎలాగ అఘోరిస్తున్నారో. అలాంటిది ఆ రోజున మీరు నాకు టోపీ వేసినప్పటి నుంచీ, నేను కడుపునిండా తిండి కూడా తినటం లేదు. భలే ఆకలిగా వున్నది. ఈ నెల రోజులవారా మీ పేరు చెప్పుకుని, యివాళ లక్షణంగా కడుపు నింపు కొంటా," అంటూ, మాయ తువ్వాలు పరిచి ఆహారం కోరుకున్నాడు.

తన కడుపు బాగా నింపుకొని రాక్షసుడు, కవల సోదరులకు కూడా వాటిల్లో కొన్ని ఫలాలు యిచ్చాడు తినమని. వాళ్ళు

కూడా కడుపులు నింపుకొన్న తర్వాత, రాక్షసుడు వాళ్ళని ముగ్గురినీ ఒక త్రాటితో కట్టివేసి, "కాసిని నీళ్ళు తాగివస్తాను, వుండండి," అంటూ కొలను వైపుకి వెళ్ళాడు.

మరి కొద్దిసేపటికి రాక్షసుడు ఒక మూడు ఆకు దొన్నెలతో నీళ్ళు తీసుకొని తిరిగి వచ్చి, వాటిని కవల సోదరులకు యిచ్చాడు.

ఇదంతా తమ పైన అభిమానంతోనే చేస్తున్నాడనుకున్నారు, సోదరులు. అందు చేత వాడు యిచ్చిన నీళ్ళు గడగడ త్రాగివేశారు. నీరు గొంతు దిగేసరికల్లా, ఇంకేముంది పాపం, ముగ్గురూ మూడు శిలా ప్రతిమలైపోయారు.

ఇలా కాగానే రాక్షసుడు, "హా! హా!! హా!!" అంటూ ఆ భవనం ప్రతిధ్వనించేట్టు విరగబడి నవ్వుతూ, ఈ కొత్త శిలా ప్రతిమలను తను కాపలా కాస్తున్న వాకిలి ప్రక్కన వుంచాడు.

ఇక్కడ యీ విధంగా కవల సోదరులు ముగ్గురూ చిక్కుపడిపోయారా? ఇక అక్కడ దానశీల మహారాజూ, రాణీ పద్మముఖీ ఎక్కడా లేని దిగులుతో కుమిలిపోతున్నారు.

తన ముద్దుల కూతుళ్ళు ముగ్గుర్నీ వెతుక్కు రావటానికని కవల సోదరులకు గుర్రాలిచ్చి పంపిన రోజునే, రాజు ఒక పని చేశాడు. కోట పై అంతస్థు మీద ఒక చిత్రమైన చిన్న గది కట్టించు






కున్నాడు. ఆ గదిలో కూర్చుని చూచి నట్టయితే చుట్టు ప్రక్కల కనుచూపు మేరలో ఎక్కడ ఎటువంటి జనసంచారం వున్నా స్పష్టంగా కనిపిస్తుంది రాజుకి. ఈ గదిలో కూచుని రోజు యిరవై నాలుగు గంటలూ, కన్నులు కాయలు కాచేట్లు చూస్తూ వుండటమే ఆయన పని.

కవల సోదరులు బయల్దేరి ఇప్పటికప్పుడే, అయిదేళ్ళు దాటింది. ఇంత వరకు వాళ్ళ అతీ గతీ లేదు. అందుకని రోజు రోజుకీ రాజుకి వ్యాకులత హెచ్చు కాజొచ్చింది. అయినా ఆశ పీడించటం చేత మధ్య మధ్య ఆస్థానజ్యోతిష్కుని సంప్రతిస్తూనే వున్నాడు. 'అమ్మాయిలు ఎక్కడనో జీవించే వున్నారని, సుఖంగా తిరిగి రాగలరనీ, నిస్పృహ చెందవలసిన పని లేనేలేదనీ' జ్యోతిష్కుడు కచ్చితంగా చెబుతూ వుండటం చేత, రాజు ప్రాణాలు ఉగ్గబట్టుకు వుంటున్నాడు.

ఒకనాడు తెల్లవారు జామున మసక చీకటిగా వుండగా రాజు యథాప్రకారం గదిలో కూచుని చూస్తూ వున్నాడు. ఆ మసక వెలుగులో దూరాన రెండు గుర్రాలు శరవేగంతో తన భవనం వైపు రావటం కనుపించింది. ఆ గుర్రాల రంగూ, వాటిపైన మనుష్యుల ఆకారాలూ, ఏటి మాటకేం, వాటికి కట్టివున్న ఆ నల్ల జండాలూ చూచేసరికి రాజు కెవ్వున కేక పెట్టి బాకుతో పొడుచుకోబోయాడు. దైవ వశాత్తు, కేక విన్న సేవకులు రెప్పపాటులో అక్కడకు చేరుకోవటం వల్ల, ఆ ప్రమాదం కాస్తా తప్పింది. ఐతే, రాజు స్పృహ తప్పి పడిపోయాడు.

కొంతసేపటికి రాజు తెప్పరిల్లుకోవటమూ, ఆ గుర్రాలు రెండూ అక్కడకు వచ్చి చేరుకోవటమూ ఒక్కసారిగా జరిగింది.

ఆ వచ్చిన గుర్రాలు కవల సోదరులకు స్వయంగా తను యిచ్చి పంపినవే. అయినా వాటి పైన వచ్చినది కవల సోదరులు కాదు! వాళ్ళు తన సేవకులు!

వాళ్ళ వైపు రాజు ఆత్రంగా పరుగెత్తి కెళ్ళి, ''అమ్మాయిలు ఏరీ? ఆ కవల పిల్లలేరీ? ఈ గుర్రాలు ఎక్కడివి మీకు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

అందుకు సేవకులు, "మహారాజా! క్షమించండి. అమ్మాయిల సంగతిగానీ, కుర్రవాళ్ళ సంగతిగానీ మా కేమీ తెలియదు. ఊరూరా మేము వెతుక్కొంటూ పోగా పోగా, ఒకానొక మైదానంలో ఈ అశ్వాలు మాకు కనుపించినై. వీటిని వెంటనే పోల్చుకుని, మన అమ్మాయిలూ, ఆ కవలలూ కనబడతారేమో అని, ఆ ప్రదేశమంతా కలియ వెతికాము. ఎంతకూ వారి జాడ తెలియకపోయేసరికి, ఒకవేళ వారు యింటికే చేరుకున్నారేమో చూదాం, లేదా ఇంతవరకు వర్తమానమైనా అందించుదాం అని మేము వచ్చేశాము, ప్రభూ!'' అన్నారు.

అంతా విని, "అంతటి అదృష్టమా!" అంటూ రాజు తిరిగి దుఃఖంతో పడిపోయాడు.

అంతా చేరి రాజుకు ధైర్యం చెప్పి ఊరడించగా తిరిగి మనస్థిమితం చిక్కిన తర్వాత, గుర్రాలపైన ఎక్కి వచ్చిన సేవకులిద్దరినీ ఎదటికి పిలిచి, ''ఓరి వాజమ్మల్లారా! అమ్మాయిలను వెదికి వెంటబెట్టుకురాక, ఎందుకని వచ్చినట్టు మీరు? వాళ్ళను వెతకబోయిన కవల సోదరుల గతి ఏమైందో పాపం! ఆ కసుగందులు ఏమి ఆపదలలో చిక్కుకున్నారో! లేకుంటే వాళ్ళ జాడ తెలియకపోవడమేమిటి యింతవరకూ? నాకు పూర్తిగా ప్రాణం విసిగి పోయింది. క్షణం కూడా నిలవలేకపోతున్నాను. మళ్ళీ మీరు వెంటనే వచ్చే ఆశ వున్నదా? ఏమో. మీరు తిరిగి వచ్చేలోపల, నా పని ఎలా వుంటుందో. సరే పోయిరండి,'' అంటూ వాళ్ళను సాగనంపాడు.

ఈ సేవకులు వచ్చిన వర్తమానం ఆ నోటా, ఆ నోటా అంతఃపురంలోకి పాకిపోయి, ఆదమరిచి వున్న రాణికి మళ్ళీ పిచ్చి పట్టింది. —(ఇంకావుంది)





# ముగ్గురు విలుకాళ్ళు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు చాలా ప్రతిభ గలవాడివి. కాని ఎంత గొప్పవాణ్ణి కూడా మించిన వాళ్ళుంటారన్నది గుర్తుంచుకో. అందుకు నిదర్శనంగా నీకు సవ్యసాచి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక ఊళ్ళో రెండు చేతులా బాణాలు వెయ్యగల విలుకాడు ఉండేవాడు. అతను విలువిద్యలో ఎంత లాఘవం గలవాడంటే, ఎగిరే పక్షులను కూడా రెండు చేతులా కొట్టేవాడు. ఆ కారణంగా అతనికి 'సవ్యసాచి' అని బిరుదు వచ్చింది. అందరూ తన విలువిద్యను పొగడుతూ

బేతాళ కథలు



ఉండటం చూసి, తన కన్న గొప్ప విలుకాళ్ళు ఉన్నారో, లేదో తెలుసుకుందామని సవ్యసాచి బయలుదేరాడు.

అతను చాలా దూరం ప్రయాణం చేసి ఒక గ్రామం చేరాడు. అక్కడ జనం గుంపులుగా ఉన్నారు. విశేషమేమిటని అడిగితే, అక్కడ దసరా ఉత్సవాలు జరుగుతున్నాయనీ, గొప్ప విలుకాళ్ళు తమ శక్తిని ప్రదర్శిస్తున్నారనీ తెలిసింది. తాను కూడా తన శక్తి ప్రదర్శించుదామని సవ్యసాచి ఉత్సవాలు జరిగే చోటికి వెళ్ళాడు.

జనం మధ్య ఖాళీలో ఒక చోట గంట కట్టారు. అక్కడికి ఒక గుడ్డివాణ్ణి తెచ్చారు. అతని చేతిలో విల్లూ, బాణమూ ఉన్నాయి. గంట మోగించారు. వెంటనే గుడ్డివాడు బాణం ఎక్కుపెట్టి, ధ్వని వచ్చిన చోటికి బాణాన్ని గురిచేసి వదిలి, సూటిగా గంటను కొట్టాడు. ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.

సవ్యసాచి తరవాత ఆ గుడ్డివాణ్ణి కలుసుకుని, "అన్నా, నేను రెండు చేతులా బాణాలు వెయ్యగలను, ఎగిరే పిట్టలను కొట్టగలను. కాని నా కన్న నువు చాలా గొప్ప విలుకాడివి. నేను నీ లాగ ధ్వనినిబట్టి బాణంతో గురిని కొట్టలేను," అన్నాడు.

దానికి గుడ్డివాడు, "అవును. అందుకే నన్ను శబ్దవేధి అంటారు. ఈ విద్యను కళ్ళున్న వాళ్ళు కళ్ళకు గంతలు కట్టుకుని ప్రదర్శిస్తారు. కాని నాలాగా పుట్టు గుడ్డిగా ఉండి శబ్దవేధి అయినవాడు ప్రపంచంలో ఎక్కడా లేడు. నేను ఎన్నడూ గురి తప్పను." అన్నాడు.

"నీ వంటి గొప్ప విలుకాళ్ళను వెతుకుతూ నేను దేశాలు తిరుగుతున్నాను. విలువిద్యలో ఎన్నిరకాల శక్తులైనా ఉండవచ్చుగద," అన్నాడు సవ్యసాచి.

"పద, నేను కూడా నీ వెంట వస్తాను," అన్నాడు శబ్దవేధి.

ఇద్దరూ బయలుదేరారు. వాళ్ళు ధర్మపురికి చేరువలో ఉండే అడవి మార్గాన

పోతూండగా, వాళ్ళకొక వింత దృశ్యం కనబడింది. వెదురు పొదల నీడలో చేతులు లేనివాడొకడు కూర్చుని ఉన్నాడు. వాడు ఎడమ కాలితో విల్లు పట్టుకుని, నోటితో బాణం పట్టి లాగి, వదిలాడు. చూస్తూండగానే ఆ బాణం రివ్వున వెళ్ళి, ఒక చెట్టు మీద ఉన్న గువ్వల జంటను కొట్టింది. రెండు గువ్వలూ నేలమీద పడిపోయాయి.

ఈ అద్భుతం చూసిన సవ్యసాచి తాను చూసినది గుడ్డివాడికి చెప్పాడు.

గుడ్డివాడు అద్భుతం చెంది, "వీడు మన కన్నా గొప్పవాడు సుమా!" అన్నాడు.

ఇద్దరూ మొండివాణ్ణి సమీపించి, వాడి విలువిద్యను మెచ్చుకుని, "చేతులు లేనివాడు బాణం వెయ్యటం మేమెక్కడా చూడలేదు. అంతేగాక నీ గురి అమోఘం!" అన్నారు. వాళ్ళు మొండివాడికి తమను తాము పరిచయం చేసుకుని, తమకు గల శక్తులు తెలిపారు.

"నా లాగా కాళ్ళతో బాణాలు వేసే వాడు ఎక్కడా లేడు. అందుకే మీరు అలాటి విలుకాణ్ణి చూడలేదు. నేను ఎన్నడూ గురి తప్పను. మీ లాగా నాకు చేతులే ఉంటే నేను రెండు కాళ్ళతోనూ, రెండు చేతులతోనూ బాణాలు వేసి ఉందును." అన్నాడు మొండివాడు.



సవ్యసాచి మిగిలిన ఇద్దరితో, "మనం ముగ్గురమూ విలువిద్యలో ప్రజ్ఞావంతులమే. కాని మన ప్రజ్ఞలు లోకానికి తెలియకపోతే ఏం లాభం? అందుచేత మనం ధర్మపురి మహారాజు వద్దకు వెళ్లి, మన విలువిద్యను ప్రదర్శించుదాం. దానితో మనకు కీర్తి, బహుమానమూ కూడా వస్తుంది." అన్నాడు.

"నిజమే. కాని రాజుగారిచ్చే బహుమానాన్ని మనం ఎలా పంచుకుంటాం?" అని మొండివాడు అడిగాడు.

"ముగ్గురమూ కలిసి ఉండి, సమంగా అనుభవించుదాం. ఇందులో పేచీలు దేనికి?" అన్నాడు సవ్యసాచి.



అందుకు మొండి వాడు ఒప్పుకోలేదు. "ఎవరికి వచ్చే బహుమానం వాళ్ళు విడి విడిగా పుచ్చుకుంటే, రాజుగారు తప్పక నాకే పెద్ద బహుమానం ఇస్తారు. మీరిద్దరూ చేతులున్న విలుకాళ్ళు. నేను చేతులే లేని విలుకాణ్ణి!" అన్నాడు మొండివాడు.

"అదేంమాట? రాజుగారు నాకే హెచ్చు బహుమానం ఇయ్యవచ్చు. మీరిద్దరూ కళ్ళున్న విలుకాళ్ళు, నేను పుట్టుగుడ్డిని!" అన్నాడు శబ్దవేధి.

సవ్యసాచికి ఈ కీచులాట చూసి చిరాకు పుట్టింది. "ఎవరి విద్య ఎంతదో రాజుగారే నిర్ణయిస్తారు. పదండి!" అన్నాడు.

అంత దూరాన నిలబడి ఒక కోయ పడుచు ఈ సంభాషణ అంతా వింటున్నది. ఆమె ఇప్పుడు విలుకాళ్ళను సమీపించి, "ధర్మపురి రాజుగారు మీ విలువిద్యలకు వేరే వేరే బహుమానాలియ్యరు. దాన్ని ఎలా పంచుకోవాలో ముందే మీరు నిర్ణయించుకోండి," అని సలహా యిచ్చింది.

సవ్యసాచి ఈ మాట విని కోపంతో, "నువు మాలోమాకు భేదాలు పెట్టటానికి చూస్తున్నావా? మీ రాజుగారు అప్పుడే బహుమానం ఇచ్చినట్టూ, దాన్ని పంచుకోవటంలో మేం కీచులాడుకున్నట్టూ చెప్పేశావు! పద, పద!" అన్నాడు.

కోయపడుచు కిల కిలా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" అని శబ్దవేధి ఆమెను అడిగాడు.

"ఎందుకా? నువ్వు గుడ్డివాడివి. ఈ అయ్యకు చేతుల్లేవు. కాళ్ళూ చేతులూ ఉన్నాయన మిమ్మల్నిద్దరినీ తన్ని బహుమానం మొత్తంగా తానే కాజెయ్యాలని చూస్తున్నాడు. అందుకే, ముందుగా మీ హెచ్చు తగ్గులు మీరు నిర్ణయించుకోవటానికి ఒప్పుకోవటం లేదు," అన్నది కోయపడుచు.

దీనికి మొండివాడు, "సరిగా చెప్పావు! మా హెచ్చు తగ్గులు మేం నిర్ణయించుకోవటం సాధ్యంగా కనబడలేదు. నువు

తెలివైన దానివిలాగున్నావు. మాలో ఎవరు గొప్పవాడో నువే నిర్ణయించు,'' అన్నాడు.

''అయితే, మీ ముగ్గురి విద్యలూ నాకు చూపండి,'' అన్నది కోయపడుచు.

అందుకు ముగ్గురూ అంగీకరించారు. మొండివాడు కాలితో విల్లు పట్టుకుని, నోటితో బాణం వదిలి, అప్పుడే చెట్టుమీద వాలిన ఒక పిట్టను కొట్టాడు. గుడ్డివాడు ఇంకో చెట్టు మీద కూస్తున్న మరొక పిట్టను కొట్టాడు. సవ్యసాచి రెండు చేతులా రెండు బాణాలు వదిలి ఎగిరే పిట్టలను రెంటిని కొట్టాడు.

అంతా చూసిన కోయపడుచు సవ్యసాచిని అందరికన్నా గొప్ప విలుకాడనీ, శబ్దవేధి రెండవ వాడనీ చెప్పి, అక్కడి నుంచి కదిలింది.

మొండివాడు కోపంతో, ''ఆగు!'' అని అరిచి, ''నీకు ఏం తెలుసునని ఇలా నిర్ణయించావు? అడివిలో బతికే దానివి, నీకు అసలు విలువిద్య అంటే ఏమిటో తెలుసునా? నీ నిర్ణయాన్ని మేం అంగీకరించం!'' అన్నాడు.

''నా నిర్ణయాన్ని అంగీకరించకపోతే మానెయ్యండి. తీర్పు చెప్పమని మీరే నన్ను అడిగారు. ఇక విలువిద్యను గురించి నాకేం తెలుసునో చూస్తావా? నీ విల్లూ, బాణమూ ఇలా ఇయ్యి,''




అని కోయపడుచు మొండివాడి విల్లూ, బాణమూ తీసుకున్నది.

ఆమె చెట్టు కొమ్మమీద ఉన్న గువ్వల జంటను చూపి, ''వాటి మధ్య ఎంత ఎడం ఉన్నదీ చూడు,'' అంటూ బాణం ఎక్కుపెట్టి, గువ్వల కేసి గురిచేసింది.

''ఆ ప్రేమపక్షులను చంపుతావా ఏం?'' అన్నాడు మొండివాడు వేళాకోళంగా.

''చూస్తూ ఉండు!'' అంటూ ఆమె బాణాన్ని వదిలింది. అది గువ్వల జంట మధ్యగా దూసుకుపోయింది. గువ్వలు కదలనైనా లేదు!

ఇది చూసి మొండివాడూ, సవ్యసాచీ నిర్ఘాంతపోయారు. కోయపడుచు విల్లును

మొండివాడి కిచ్చేసి, తన దారిన తాను వెళ్ళిపోయింది.

జరిగినదంతా శబ్దవేధి కూడా విన్నాక, ముగ్గురు విలుకాళ్ళూ రాజదర్శనం మాట కట్టిపెట్టి, వెనక్కు తిరిగి వెళ్ళి పోయారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కోయయువతి తన విలువిద్యా ప్రావీణ్యం రుజువు చేసుకున్నది గదా, ఆమె విలు కాళ్ళ హెచ్చు తగ్గులను అలా ఎందుకు అంచనా వేసింది? వాళ్ళు రాజుగారికి తమ విలువిద్యలు చూపకుండా ఎందుకు వెళ్ళిపోయారు? ఈ ప్రశ్నలకు సమా ధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కోయ పడుచు చేసిన తీర్పులో పొరపాటు ఏమీ లేదు. సవ్యసాచి మిగిలిన ఇద్దరికన్నా నిజంగానే గొప్ప విలుకాడు. ఎందుచేత నంటే, కావాలంటే అతను మిగిలిన ఇద్దరి విద్యలూ సాధించగలడు; వాళ్ళు అతనిలాగా సవ్యసాచి కాలేరు. గుడ్డివాడు ధ్వని చెయ్యని గురిని కొట్టలేడు. మొండి వాడు తప్పనిసరి అయి కాలితోనో, నోటి తోనో బాణాలు వెయ్యటం నేర్చుకున్న వాడు. సవ్యసాచి తప్ప మిగిలిన ఇద్దరూ గురికాళ్ళేగాని గొప్ప విలుకాళ్ళు కారు. ఇక, వాళ్ళు రాజును చూడకుండా తిరిగి వెళ్ళిపోయిన దెందుకంటే, బాణాలు పట్టుకు తిరగని కోయపడుచుకే అంత లాఘవం ఉంటే, ఆ అరణ్యంలో విలు కాళ్ళుగా తిరిగే ఇతర కోయల కెంత సామర్థ్యం ఉంటుందో ఊహించవచ్చు. తన నగరం చెంత ఉండే అరణ్యంలో అలాటి విలుకాళ్ళు ఉండగా తాము రాజును మెప్పించగలమని సవ్యసాచీ, అతని మిత్రులూ అనుకుని ఉండరు. అందుకే వాళ్ళు ఆ ప్రయత్నం మాను కున్నారు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# చెరపకురా చెడేవు

ఒక ఊళ్ళో సీతాపతి, లక్ష్మీపతి అనే ఇద్దరు అత్తరు వర్తకులుండేవాళ్ళు. సీతాపతి నిజాయితీగా మేలు రకం అత్తర్లు అమ్మేవాడు. లక్ష్మీపతి దురాశతో అత్తర్లు కల్తీచేసి అమ్మేవాడు. అందుచేత అతని వ్యాపారం క్రమంగా దెబ్బతిని, చివరకు పూర్తిగా పడిపోయింది. తన లాగే అత్తర్లు కల్తీ చేసి అమ్మమని లక్ష్మీపతి సలహా ఇస్తే సీతాపతి వినలేదు.

సీతాపతి కొడుకు రామూ అనే కుర్రవాడికి దుబారా ఖర్చు అలవాటు చేసి, వాడి ద్వారా సీతాపతి వ్యాపారం దెబ్బ తియ్యాలని, లక్ష్మీపతి ఆ కుర్రవాడికి డబ్బు లియ్యటం ప్రారంభించాడు. రామూ ఆ డబ్బు తీసుకుంటూ వచ్చాడు.

కొంత కాలమయాక లక్ష్మీపతి రామూను, "మీ ఇంట్లో మొగలిపువ్వుల అత్తరు సీసా ఉంటే పట్టుకురా," అన్నాడు. రామూ డబ్బు ఇయ్యమన్నాడు. లక్ష్మీపతి ఇచ్చాడు. రామూ సీసా తెచ్చి ఇచ్చాడు.

లక్ష్మీపతి రామూను, "నే నిచ్చిన డబ్బు ఏం చేశావు?" అని అడిగాడు.

"నువు ఇచ్చిన డబ్బులన్నీ మా నాన్నకే ఇస్తున్నాను!" అన్నాడు రామూ. తన ఎత్తు పారనందుకు లక్ష్మీపతి హతాశుడైపోయాడు.

—శిరువురం మధుసూదన్.





# జీవనోపాధి

ఒకనాటి అర్ధరాత్రి వేళ వినయుడు అనే వాడు ఒంటరిగా పొలాల గట్ల వెంబడి నడుస్తూ నగరం కేసి వస్తూండగా అతనికి ఒక దృశ్యం కనిపించింది. ఒక చెట్టు కింద దొంగ ఒకడు ఆ రాత్రి తాను దొంగిలించిన డబ్బు లెక్క పెట్టుకుంటున్నాడు.

డబ్బు చూడగానే వినయుడి కళ్ళు మెరిశాయి. వాడు చప్పుడు చేయకుండా అడుగులో అడుగు వేసుకుంటూ, దొంగ కూర్చుని ఉన్న చెట్టు చాటుకు చేరుకున్నాడు.

దొంగ డబ్బు లెక్కించటం పూర్తి చేసి, దాన్ని ఒక సంచీలో పోసి, చెట్టుకు చేరగిలబడి, త్వరలోనే గురక పెట్టసాగాడు. దొంగ గాఢనిద్రలో ఉన్నాడని రూఢి చేసుకుని, వినయుడు తన చెయ్యి చాచి, డబ్బుమూట అందుకున్నాడు. వాడి చేతిమీద ఛెళ్ళుమని దెబ్బపడింది.

ఆ దెబ్బకు వినయుడు డబ్బుమూట వదిలేసి, ముందుకు తూలిపడ్డాడు.

దొంగ వాడి పీక పట్టుకుని, "దొంగతనం చేయటం చేతకాదుట్రా, చవట వెధవా ?" అన్నాడు కోపంగా.

"చాతనవునండి!" అన్నాడు వినయుడు ఏడుపు గొంతుతో.

"నీ మొహం! దొంగ అయినవాడు దొంగసొమ్ము బయట ఉంచుకుని నిద్ర పోతాడా ? నువు నిజంగా దొంగవై ఉంటే నాకు చిక్కేవాడివే కావు! నువు నక్కి నక్కి రావటం చూసి నువు కూడా దొంగవేమోనని ఆశపడ్డాను," అన్నాడు దొంగ.

"నీకు మరొక దొంగవాడు దేనికి ?" అని వినయుడు అడిగాడు.

"ఒంటరిగా అన్నిపనులూ చేసుకోవటం కష్టంగా ఉన్నది. జతగాడి కోసం చూస్తున్నాను," అన్నాడు దొంగ.

ఎం. కామేశ్వరరావు

"ఇంకేం? నేనూ బతుకు తెరువు కోసమే చూస్తున్నాను. నన్ను నీ జతగాడిగా పెట్టుకో," అన్నాడు వినయుడు.

"నిన్నా? నువు ఈ వృత్తికి ఎంత మాత్రమూ పనికిరావు," అన్నాడు దొంగ.

"అలా అనవద్దు. నేను ఎంతమందిని మోసం చేసి మా వూరినుంచి వచ్చానో తెలుసా? అప్పులు చేసి, ఒక్క అప్పు తీర్చకుండా బయటపడ్డాను," అన్నాడు వినయుడు.

దొంగ విరగబడి నవ్వి, "ఏడిచి నట్టుంది! రేపు వాళ్ళంతా నిన్ను వెతుక్కుంటూ రారూ?" అని అడిగాడు.

"రారు. మోసం చేశానంటే పారిపోయి వచ్చాననుకుంటున్నావా? కాదు. నిన్న నేను అప్పులు తీర్చవలసిన రోజు. అందరికీ ఎగనామం పెట్టాను. ముఖ్యంగా మూడు మోసాలు చెబుతాను. విని నువు మూర్ఛపోతావు," అంటూ వినయుడు ఇలా చెప్పాడు.

నిన్న ఉదయం వినయుడు వీధిన నడుస్తూ, సందు తిరగగానే సుబ్బశాస్త్రి కనిపించాడు. సుబ్బశాస్త్రిని చూడగానే వినయుడు పక్క ఇంటికేసి మొహం తిప్పేసుకున్నాడు.

శాస్త్రి వినయుణ్ణి చూసి, అతని జబ్బ ఒడిసి పట్టుకుని, "ఎటో చూస్తావేం?



నా కళ్ళల్లో నే దుమ్ము కొట్టాలనుకున్నావా?" అని గర్జించాడు.

వినయుడు అప్పుడే శాస్త్రిని చూసినట్టు నటిస్తూ, "మీరా, శాస్త్రిగారూ? నేను కూడా ఇలాంటి ఇల్లే కట్టింతామనుకుంటున్నాను. అయితే, ఇల్లు ఎత్తుమరీ తక్కువ. ఏ దొంగవాడైనా ఇక్కడినుంచి మిద్దె పైకి ఎగిరి దూకగలడు," అన్నాడు.

"నీ మొహానికి ఇల్లుకూడానా? ముందు నా యాభై రూపాయలు నాకు ముట్టజెప్పు," అన్నాడు సుబ్బశాస్త్రి.

"ఇస్తానులే. మా దూరపు బంధువు ముసలి దొకతె చస్తూ ఆస్తి అంతా నాకు



ఇచ్చిపోయింది. వెంటనే ఇల్లు కట్టాలి. ఈఎత్తు ఇంటి మీదికి ఎవడైనా అమాంతం ఎగరలేడూ ?'' అన్నాడు వినయుడు.

''అసంభవం! మానవమాత్రు డెవడూ అంత ఎత్తు ఎరగలేడు.'' అన్నాడు సుబ్బశాస్త్రి.

'' మీకేమన్నా మతిపోయిందా ? నేనే ఆ ఇంటి మీదికి ఎగిరి దూకగలను. కావలిస్తే ఆ యాభైరూపాయలు పందెం వెయ్యండి,'' అన్నాడు వినయుడు.

మొత్తం వందా వసూలు చేసుకో వచ్చు ననుకుని సుబ్బశాస్త్రి సరే నన్నాడు. వినయుడు ఎగరబోయి కింద పడి, ''పందెంలో ఓడాను. నేను మీకు యాభై బాకీ ఉన్నాను. మీరు నా యాభై గెలుచు కున్నారు. ఆ యాభైకీ ఈయాభైకీ చెల్లు!'' అన్నాడు.

శాస్త్రి వినయుడి చెయ్యి పట్టుకుని, ''ఏమిటి నువ్వంటున్నది? యాభైకి యాభై చెల్లు అంటావేమిటి?'' అన్నాడు.

''అంతే! యాభైకి యాభై చెల్లు!'' అన్నాడు వినయుడు. సుబ్బశాస్త్రి విన యుణ్ణి గ్రామాధికారి దగ్గిరికి లాక్కు పోయాడు. గ్రామాధికారి ముక్కోపి. విన యుడు ఆయన్ను చూస్తూనే, ''యాభైకి యాభై చెల్లుకాదా? చెప్పండి!'' అన్నాడు.

గ్రామాధికారి చిరాకుతో, ''చెల్లే! వెళ్ళండి,'' అన్నాడు.

'' అలా ఎలా అవుతుందండీ ? '' అంటూ శాస్త్రి ఏదో చెప్పబోయాడు.

గ్రామాధికారి కోపంగా, ''నీకు మతి పోయిందా ఏం? నేను చెబుతున్నాను. యాభైకి యాభై చెల్లే. మళ్ళీ ఈ చాయలకు రాకు!'' అన్నాడు.

వినయుడు సుబ్బశాస్త్రిని బలవంతాన అక్కడి నుంచి అవతలికి తీసుకుపోయి, ''ఆయన కూడా చెప్పాడు గద. ఆయనకు ఇంకా కోపం తెప్పిస్తే కొరడా దెబ్బలు తప్పవు.'' అన్నాడు.

కొరడా దెబ్బలు అన్నమాట వింటూనే సుబ్బశాస్త్రి కెవ్వున అరిచాడు. వినయుడు

ఆయనను ఇంటిదాకా తీసుకుపోయి దిగబెట్టాడు. ఆ బాకీ అలా చెల్లిపోయింది.

వినయుడు చేసిన రెండో ఘనకార్యం ఏమిటంటే, ఆ రోజు మధ్యానంవేళ అతను శెట్టికి దొరికాడు. శెట్టి అతని చెయ్యి పట్టుకుని, "నీకోసం కాళ్లు అరిగేటట్టు తిరుగుతున్నాను. నా బాకీ డెబ్బై కక్కు!" అన్నాడు.

"నేనూ ఆ డెబ్బై కోసమే బయలుదేరాను. నీ ముష్టి డబ్బు నేను వాడుకున్నాననుకుంటున్నా వేమిటి? అదుగో, ఆ ఇంటి అరుగు మీద ఉన్న ముసలాయనకు ఇచ్చాను. ఆయనకు డెబ్బై ఎక్కడినుంచో రావాలిట. వచ్చాయేమో కనుక్కుందాం పద," అన్నాడు వినయుడు.

అరుగు మీద ముసలాయన మంచం మీద మంచి నిద్రలో ఉన్నాడు. తలుపు తట్టితే ఒక అమ్మాయి వచ్చి తలుపు తీసింది. వినయుడు ఆ అమ్మాయికి ముసలాయనను చూపించి, "ఎప్పుడడిగినా ఆయన డెబ్బై ఇంకా రాలేదంటాడు. మనమరాలివి, నీ కేమన్నా తెలుసునా?" అన్నాడు.

"డెబ్బై ఏం కర్మ? ఎనభై వచ్చాయి. పిసినారి వాడు, ఎవరికీ కానీ ఇయ్యక పోగా అందరినీ కాల్చుకు తింటున్నాడు!"



అన్నది ఆ అమ్మాయి, తలుపు మూసుకుంటూ. ఆ పిల్ల ముసలాయన వయసు గురించి మాట్లాడినా, డబ్బు గురించే మాట్లాడిందని శెట్టి అనుకున్నాడు.

"ఇంకేం? వచ్చిన డబ్బంతా దాచాడన్నమాట! ఎనభై అంటే నీకు వడ్డీకూడా గిట్టుబాటవుతుంది. మరి నేను వెళతాను," అంటూ వినయుడు వెళ్ళిపోయినట్టే వెళ్ళి, పూలపొదల మాటున దాక్కుని, ఏం జరిగేదీ చూడసాగాడు.

ముసలాయన లేస్తాడని చాలా సేపు చూసి విసిగి, శెట్టి ఆయనను లేపటానికి తట్టాడు. ముసలాయన ఏ పిల్లో, కుక్కో అనుకుని శెట్టిని గట్టిగా కాలితో ఒక్క



తన్నుతన్నాడు. కాని ఆయన నిద్ర లేవలేదు.

ఆ తన్నుకు శెట్టి మాత్రం అరుగుమీది నుంచి కింద పడ్డాడు. శెట్టికి చాలా కోపం వచ్చింది. అతను లేచి, అరుగు మీద ఆనించి ఉన్న కర్రతో ముసలాయన డొక్కలో గట్టిగా పొడిచి, "నా డబ్బు నాకు పారేసి మరీ నిద్రపో," అన్నాడు.

శెట్టి పొడిచిన పోట్లు ముసలాయనకు ఎక్కడ తగిలాయో గాని, ఆయన భయంకరంగా మూలిగి, ప్రాణాలు వదిలాడు. శెట్టి తన దగ్గిర ఉన్న మూడువందలూ ఉత్తర క్రియలకు గాను ముసలాయన కొడుకు చేతిలోపెట్టి, ఉరిశిక్ష పడకుండానూ, విచారణ జరగకుండానూ తప్పించుకున్నాడు.

ఆ సాయంత్రం వినయుడు శూరవర్మకు చిక్కాడు. శూరవర్మ క్షత్రియుడు. బక్కగా, ఎముకల పోగులా ఉంటాడు. దానికి తోడు పెద్దగూని. అతనికి పెళ్ళి కాలేదు. వడ్డీవ్యాపారం చేసి బతుకుతున్నాడు. వినయుడు అతనికి నూటయాభై బాకీ ఉన్నాడు.

"శూరవర్మగారూ, అందరి బాకీలూ తీర్చేసి చేతులు ఖాళీ చేసుకున్నాక కనిపించారేమండీ!" అన్నాడు వినయుడు.

"నన్నేం చెయ్యమంటావు? ఇంటి పని అంతా నేనే చేసుకోవాలాయె. నీ కోసం బయలు దేరటానికి ఇప్పటిదాకా తీరలేదు," అన్నాడు శూరవర్మ.

"తెలియక అడుగుతాను, మీరు ఇంత దాకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదూ?" అని వినయుడు అడిగాడు.

"పిల్లను ఎవరిస్తారు?" అన్నాడు శూరవర్మ నీరసంగా.

"మీకు పిల్ల నియ్యటానికేమండీ? ఆ ఇంట్లో పార్వతమ్మ అనే ధనవంతురాలున్నది. ఆమెకు చుక్క అనే కూతురున్నది; చక్కని చుక్క! ఆ పిల్లను మీలాటి వాడికే ఇచ్చి చెయ్యాలని చూస్తున్నది పార్వతమ్మ. వెళ్ళి అడిగెయ్యండి.

పార్వతమ్మకు కోతులంటే ముద్దు. కుక్కలంటే ప్రాణం. ఎవరినన్నా కోతి లాగా ఉన్నదంటే ఆవిడకు అమిత ఆనందం! కుక్కను చూసినట్టు చూస్తానంటే పరమ సంతోషం! అది మరిచిపోకండి." అన్నాడు వినయుడు.

శూరవర్మ ఈ విషయాలు తెలుసుకుని ఉబ్బి తబ్బిబ్బయిపోయి, పార్వతమ్మ ఇంటికి వెళ్ళాడు. ఆమె, "ఏం కావాలి? ఎవరి కోసం?" అని అడిగింది.

"మీ చుక్కని పెళ్ళాడ గోరివచ్చాను. మీ అల్లుణ్ణి కావాలని ఉన్నది." అన్నాడు శూరవర్మ.



పార్వతమ్మ లోపలికి వెళ్ళి వాంతి చేసుకుని, అట్లకాడ కాలేసి, మళ్ళీ వచ్చి, శూరవర్మను మర్యాద చేసి కూర్చోబెట్టి, "మా చుక్క అదృష్టవంతురాలు. దాన్ని గురించి మీ అభిప్రాయ మేమిటి?" అన్నది.

శూరవర్మ ఇకిలించి, "కోతిలా ఉంటుంది! చుక్కకేం?" అన్నాడు.

"సరే, అల్లుడూ! పెళ్ళి అయాక నేను మీ యింటి కొస్తే నాకు ఎలాటి మర్యాద చేస్తావు?" అని అడిగింది పార్వతమ్మ.

"కుక్కను చూసినట్లు చూస్తాను. తక్కువ చేస్తానా?" అన్నాడు శూరవర్మ.

పార్వతమ్మ లేచి లోపలికి వెళ్ళి, ఎర్రగా కాలిన అట్లకాడ తెచ్చి శూరవర్మ వీపు మీద మూడు వాతలు వేసి, "పోరా, వెధవా! నీ మొహానికి పెళ్ళి ఒకటి తక్కువ అయిందా?" అని అతన్ని బయటికి నెట్టి, తలుపు వేసుకున్నది.

శూరవర్మ చీకటి మాటున ఇల్లు చేరుకుందామనుకుంటే, వినయుడు దాపరించి, "డబ్బు తీసుకోకుండా వెళుతున్నారేం? ఈ వాత లేమిటీ? పార్వతమ్మ పెట్టినట్టుందే?" అన్నాడు.

"ఊరుకోరా, బాబూ! ఇదంతా నీ మూలానే జరిగింది. నువు డబ్బు ఇవ్వక్కర్లేదు గాని, ఈ సంగతి మాత్రం

ఎక్కడా అనకు, పరువుపోతుంది.'' అని శూరవర్మ వినయుడి చేతిలో పాతిక రూపాయలు పెట్టి, తలవేళ్ళాడ వేసుకుని వెళ్ళిపోయాడు.

వినయుడు కూడా ఒకప్పుడు పార్వతమ్మ చేత వాతలు వేయించుకున్నా వాడే. అతను మానిపోయిన ఆ వాతలను తడువుకుని, ఆ చీకట్లోనే ఊరు విడిచి ఇలా వచ్చాడు.

వినయుడు చేసిన ఘనకార్యాలను విని దొంగ నవ్వి, ''నీ అంత చవట మరొకడు ఉండడు. పరిస్థితులు నీకు అనుకూలించాయే గాని, నీ తెలివి తేటలు ఏమీ లేదు. సుబ్బశాస్త్రి వెర్రివెధవ. నేనే అయితే నిన్ను ఎడమచేత్తో ఎత్తి ఇంటి మీదికి విసిరేవాణ్ణి. శెట్టి విషయంలో ముసలాయన అనుకోకుండా చచ్చాడు గనక నీకు అనుకూలించింది. శూరవర్మ, పార్వతమ్మ దగ్గిర వ్యవహారం బెడిసి కొట్టకపోతే, నీ డబ్బు ముక్కుపిండి వసూలు చేసేవాడు. నా జతగాడుగా ఉండటానికి నువు ఎంతమాత్రమూ పనికిరావు.'' అన్నాడు.

దొంగ వెళ్ళిపోయాక వినయుడు చెట్టు కిందనే కూర్చుని ఆలోచించాడు. అతనికి అప్పులు చెయ్యటమంటే భయం పట్టుకున్నది. అదీగాక తనకు నగరంలో అప్పిచ్చేవాడెవడు ? దొంగతనం చెయ్యటానికి కూడా తాను పనికిరాడు. చదువు లేదు, ఆస్తి లేదు. తనకు జీవనోపాధి ఏమిటి ?

తెల్లవారవస్తున్నది. జనం గుంపులుగా పొలం పనులకు పోతున్నారు. వినయుడు చప్పున లేచి, ''నేను పని చేస్తాను. మీతోపాటు రానిస్తారా ?'' అని వాళ్ళను అడిగాడు.

''అలాగే రా. దానికేం భాగ్యం! అయితే కష్టంచేయాలి.'' అన్నారు వాళ్ళు.

వినయుడికి జీవనోపాధి దొరికింది. అతను వాళ్ళతో కలిసి ఉదయిస్తున్న సూర్యుడి దిక్కుగా, పొలాలకు సాగిపోయాడు.



# తీర్పు

రామన్న అనే శిష్యుడు గురువు వద్ద న్యాయశాస్త్రం చదువుకున్నాడు. అతను చదువు ముగించి వెళ్ళిపోయేటప్పుడు గురువు అతన్ని గురుదక్షిణ కింద వెయ్యివరహాలు ఇయ్యమని అడిగాడు.

"ఇప్పుడు నేను ఇచ్చుకోలేను. నేను నా మొదటి వ్యాజ్యంలో గెలిచినప్పుడు మీకు వెయ్యివరహాలూ ఇచ్చుకుంటాను," అన్నాడు రామన్న. గురువు సరేనన్నాడు.

రామన్న వెళ్లిపోగానే గురువుగారు న్యాయస్థానంలో అతని మీద వెయ్యివరహాలకు వ్యాజ్యం తెచ్చాడు.

న్యాయాధికారి రామన్నను, "ఏం చెప్పుకుంటావు?" అని అడిగాడు.

"గురువుగారు నన్ను వెయ్యివరహాలు గురుదక్షిణ అడిగిన మాట నిజమే. నేను మొదటి వ్యాజ్యంలో నెగ్గితే ఇస్తానన్న మాటా నిజమే. కాని ఇప్పుడు మీరు నా చేత ఆయనకు వెయ్యి వరహాలూ ఇప్పిస్తే నేను నా మొదటి వ్యాజ్యంలో ఓడిన వాణ్ణి అవుతాను గనుక ఆయనకు గురుదక్షిణ ఇయ్యనవసరంలేదు. ఆయన ఈ వ్యాజ్యంలో ఓడిపోతే ఆయన కోరిన మొత్తాన్ని మీరే నిరాకరించిన వారు అవుతారు గద!" అన్నాడు రామన్న.

న్యాయాధికారికి ఏమీ తోచక, విచారణ నూరేళ్లపాటు వాయిదా వేశాడు.

—యామర్తి పద్మావతి.





ఒక గ్రామంలో జనకుడనే లోభి ఉండే వాడు. అతనిది నీచబుద్ధి కూడాను. అతనికి ప్రపంచంలో డబ్బుతో సమానమైనది లేదు. డబ్బు కోసం అతను ఏ పని చెయ్యటానికైనా సిద్ధమే.

జనకుడి కొడుకు రాము తండ్రికి విరుద్ధమైనవాడు. అతను తన వూరికి యాభై మైళ్ళ దూరాన ఒక పట్టణంలో ఒక వర్తకుడి వద్ద పనిచేసేవాడు. అందుచేత అతనికి ఇంటి పట్టున ఉండే అవకాశంలేదు.

రెండేళ్ళ క్రితం జనకుడి భార్య పోయింది. కాచిపోసే ఆడదిక్కు ఉండాలని అతను తన కొడుక్కు సులత అనే పిల్లను పెళ్లి చేశాడు. సులత తండ్రి సంపన్నుడైన భూస్వామి. ఆయన రాముకు కట్నాలూ, కానుకలూ ఘనంగా ఇచ్చాడు.

సులత నాజూకైన పిల్ల, తెలివిగలది. పెళ్ళికి పూర్వం ఆమె ఇంటి వద్దనే ఉండి, తన పినతండ్రి వద్ద కొంత చదువుకున్నది. ఆయన పేరు దేవదత్తుడు. ఆయన బడిపంతులుగా ఉంటూ, ఇంద్రజాలం కూడా నేర్చుకున్నాడు.

పెళ్ళికాగానే సులత తన మామగారికి ఇంటి నౌకరు అయింది. లోభి అయిన జనకుడు వేరే పనివాళ్ళను ఎవరినీ పెట్టుకోక పోవటంచేత ఇంటిపని అంతా తన చేతి మీదుగానే సులత చెయ్యవలసి వచ్చేది. ఆమె ఎంతో ఓర్పుతో, ఇంటి చాకిరి అంతా తానే చేసేది. పెళ్ళి అయిన తరవాత ఆమె భర్త వెంట ఉండే అవకాశం కూడా లేదు. రాము ఎప్పుడైనా ఇంటికి వచ్చి, ఒకటి, రెండు రోజులు ఉండి, తిరిగి పట్నం వెళ్లిపోయేవాడు. భర్త వచ్చినప్పుడు కలిగే ఆనందమే తప్ప

మిగతా కాలంలో సులతకు జీవితం ఎంతో దుర్భరంగా ఉండేది.

కోడలిని జనకుడు పుట్టింటికి వెళ్ళనిచ్చేవాడు కాదు; ఆమె లేకపోతే తానే వంట చేసుకోవాలి! గడచిన రెండేళ్లలోనూ సులత ఒక్కమారే తన భర్తతో సహా పుట్టింటికి వెళ్లింది.

రెండేళ్లు గడిచినా తన కోడలి కడుపున ఒక నలుసు పుట్టలేదని జనకుడు గునుస్తూ ఉండేవాడు. ఒకటి రెండుసార్లు అతను రాముతో, "ఈ పెళ్ళాన్ని వదిలేసి మరొక పెళ్ళి చేసుకో. గ్రామపెద్ద గంగాధరుడి కూతురు సులోచన లక్షణమైన పిల్ల. ఆ పిల్లను చేసుకుంటే గంగాధరుడు కట్నం కింద అయిదెకరాల సుక్షేత్రమైన పొలమూ, వెయ్యిరూపాయల నగదూ ఇస్తాడు," అన్నాడు.

"సులత ఏం తప్పు చేసిందని వెళ్ళగొట్టను? సులోచన పిల్లల్ని కంటుందని నమ్మకం ఏమిటి? నాకే పిల్లల గీత లేదేమో?" అన్నాడు రాము.

అయినా జనకుడు ఆశ వదులుకోలేదు. రాముకు రెండో పెళ్ళి చెయ్యాలన్న కోరికకు కారణం జనకుడి లోభమే. గంగాధరుడు పొలమూ, రొక్కమూ ఇస్తాడు. కాని సులోచన అనాకారి. ఆమెకు ఒక కన్ను పువ్వు వేసింది.

సులత పుట్టింటి నుంచి నెల నెలా ఎవరో ఒకరు ఆమెను చూడవస్తూనే ఉండేవారు. వచ్చేవాళ్లు మిఠాయీ, కూర





గాయలూ, రకరకాల పళ్లూ తెచ్చేవాళ్లు. అందుచేత వాళ్ళు అలా రావడం జనకుడికి అభ్యంతరం లేదు. వాళ్ళ ద్వారా సులత తల్లి తన కూతుర్ని ఒక్క సారి చూడాలని ఉన్నదని ఎన్నోసార్లు కబురు చేసింది. కాని జనకుడు తన కోడల్ని పుట్టింటికి పంపాడు కాడు. మాట దక్కదని సులత నోరు మూసుకుని ఉండిపోయేది.

ఒకనాడు సులత పినతండ్రి దేవదత్తుడు సులతను చూడవచ్చి, "నీ కోసం బెంగ పడి మీ అమ్మ మంచం పట్టింది. నిన్ను చూస్తే గాని కోలుకోదని డాక్టర్లు అంటున్నారు," అని చెప్పాడు.

సులతను వదిలించుకోవటానికి ఇది మంచి అవకాశమని జనకుడికి తోచింది. అతను దేవదత్తుడితో, "నేను సులతను మంచిరోజుచూసి పుట్టింటికి పంపేస్తాను," అన్నాడు. దేవదత్తుడు వెళ్లిపోయాడు.

జనకుడు దీర్ఘంగా యోచనచేసి ఒక దుర్మార్గం తలపెట్టాడు. అతను గంగాధరుడితో తన ఆలోచన చెబితే, సులతను వదిలించుకునేటందుకు అది దివ్యమైన మార్గమని అతను కూడా ఒప్పుకున్నాడు.

జనకుడు ఇంటికి తిరిగివచ్చి సులతతో, "అమ్మాయీ, నిన్ను రేపు మీ పుట్టింటికి పంపుదామనుకుంటున్నాను. కాని ఒక్క షరతు. అందుకు నువు ఒప్పుకోవాలి," అన్నాడు.

"ఒప్పుకుంటాను, మామయ్యా." అన్నది సులత.

"ఇదుగో, ఈ సీసా తీసుకో. నువు మళ్లా తిరిగి వచ్చేటప్పుడు ఈ సీసాలో ఒక వింత తీసుకురావాలి—అది చూడగానే అందరికీ అద్భుతం అనిపించాలి! తెలిసిందా? అలా చెయ్యలేకపోతే నువు తిరిగి రానవసరంలేదు. రాముకు మరో పెళ్ళి చేసేస్తాను," అంటూ జనకుడు సన్నని మూతిగల సీసా ఒకటి పైకితీశాడు.

సులత క్షణంసేపు కళ్ళు మూసుకుని, "అర్థమయింది, మామయ్యా," అన్నది.

"ఈ షరతుకు నువు ఒప్పుకున్నావు గదా?" అని జనకుడు రెట్టించి అడిగాడు.

"ఒప్పుకున్నాను, మామయ్యా. కాని నేను కూడా ఒక షరతు కోరుతాను. షరతు అన్న తరవాత ఉభయపక్షాలా ఉండాలి కదా!" అన్నది సులత.

"ఏమిటి నీ షరతు?" అని జనకుడు అడిగాడు.

"నేను మీ షరతు నెరవేరిస్తే నన్ను ఇక్కడే ఉండమని మీరు నిర్బంధించ రాదు; నా యిష్ట ప్రకారం నన్ను మా ఆయన వెంట పట్నంలో ఉండ నియ్యాలి. అందుకు సమ్మతమేనా?" అని సులత అడిగింది.

జనకుడు తీవ్రంగా ఆలోచించి, చివరకు సరే నన్నాడు. సులత ఆయన్ని దేవుడి దగ్గిరికి తీసుకుపోయి ప్రమాణం చేయించి, తాను కూడా షరతుకు బద్ధు రాలినవుతానని ప్రమాణం చేసి, అతను ఇచ్చిన సీసాతో సహా పుట్టింటికి వచ్చేసింది.

"ఆ సీసా ఏమిటే?" అని సులతను తండ్రీ, తల్లీ, పినతండ్రీ అడిగారు.

"విడాకులు! నన్ను మామగారు వెళ్ల గొట్టేశారు!" అంటూ సులత జరిగిన దంతా చెప్పింది.

దేవదత్తుడు అంతా విని, చిన్నగానవ్వి, "ఈ మాత్రానికి నువ్వేమీ దిగులుపడనవ సరం లేదులే. ఇంతకాలానికి నా ఇంద్ర జాలం అక్కరకు రావచ్చు. ఇక్కడ



ఉండే వారంరోజులూ నిశ్చింతగా గడుపు. ఆ జనకుడికి బుద్ధి చెబుతాను. నువ్వు సీసాలో అద్భుతం తీసుకుపోదువుగాని!'' అన్నాడు.

దేవదత్తుడు ఒక వెడల్పయిన గాజు పాత్రలో శనగపులుసు పోసి, సీసా మూతి కన్నా పెద్ద గుడ్డును అయిదురోజులపాటు అందులో ముంచి ఉంచాడు. తరవాత దాన్ని శనగపులుసు నుంచి పైకి తీస్తే, అతిమెత్తగా సాగింది. ఆ స్థితిలో ఆయన దాన్ని ఉపాయంగా సీసా లోపలికి తోసి, దానితోబాటు సీసాలోకి కొంచెం కొంచెంగా చల్లని నీరు పోశాడు. గుడ్డు యథా రూపానికి వచ్చి, తిరిగి గట్టిపడింది.

సులత అత్తవారింటికి బయలుదేరే లోపల రాముకు పిలుపు వెళ్ళింది. అతను అత్తవారిల్లు చేరుకున్నాడు. సులత వెంట ఆమె భర్తా, తండ్రీ, పినతండ్రీ కూడా జనకుడి ఇంటికి వచ్చారు.

మెట్టినిల్లు చేరుతూనే సులత తన మామగారికి సీసా చూపి, ''మీరు సీసాలో వింత తెమ్మన్నారు గదా. ఇదుగో, మామయ్యా!'' అన్నది.

జనకుడు సీసా తీసుకుని, అందులో ఉన్న గుడ్డును అన్ని వైపులనుంచీ తిప్పి, తిప్పి చూశాడు. సీసాలో ఎక్కడా పగులు లేదు. కాని అందులో పెద్ద గుడ్డు ఉన్నది. అంత చిన్న సీసా మూతి గుండా అంత పెద్ద గుడ్డు ఎలా లోపలికి వెళ్ళింది? అతనికి చాలా ఆశ్చర్యం వేసింది.

''వింతే నని ఒప్పుకుంటారా, మామయ్యా?'' అని సులత అడిగింది.

''అహా, ఇది వింతగాక మరేమిటి! ఒప్పుకుంటాను,'' అన్నాడు జనకుడు గొంతు పూడిపోతూ.

''అలా అయితే, మీ రిచ్చిన మాట నిలబెట్టుకుని, నన్ను మా ఆయన వెంట పట్నం పంపించండి,'' అన్నది సులత.

ఆమె తన భర్తతోబాటు పట్నం వెళ్ళిపోయి, అక్కడే కాపరం పెట్టింది. ఆమెకిప్పుడు ఇద్దరు పిల్లలు—ఒక కొడుకూ, ఒక కూతురూనూ.






ఒక ఊళ్ళో ఇద్దరు దొంగలుండే వాళ్ళు. ఒకడు దొంగతనంలో నిపుణుడు. రెండో వాడు పట్టుబడకుండా తప్పించుకోవటంలో నిపుణుడు.

ఒక సారి ఆ వూరి పండితుడు ఇల్లు తాళం పెట్టి, పక్క గ్రామంలో జరిగే పెళ్లికి కుటుంబ సమేతంగా వెళ్ళాడు. అవకాశం చూసుకుని దొంగలిద్దరూ ఆ రాత్రి పండితుడి ఇంట జొరపడ్డారు; ఇంట్లో దొరికిన దంతా మూటలు కట్టి, బయట పడటానికి చూస్తున్నారు.

ఆ సమయంలో ఒక రైతు దొంగల జాడ పసిగట్టి, "దొంగలు! దొంగలు!" అని గట్టిగా కేకలు పెట్టాడు. ఆ కేకలకు చాలామంది దుడ్డు కర్రలతో వచ్చి, పండితుడి ఇల్లు చుట్టుముట్టారు.

ఇదంతా చూసి, లోపల ఉన్న దొంగలు హడలిపోయి, తలుపులు లోపల గడియ పెట్టుకుని, భయంతో వణకసాగారు. కొంచెం సేపయాక, యుక్తిపరుడైన దొంగ రెండో వాడితో, "మనం భయపడి లాభం లేదు. ఎలాగైనా తప్పించుకునే మార్గం చూడాలి," అంటూ ఒక ఉపాయం చెప్పాడు.

తరవాత మొదటివాడు ఆడగొంతు పెట్టి, "బయట ఆ గలభా ఏమిటి, మామా?" అని గట్టిగా అన్నాడు.

రెండోవాడు గొంతు మార్చి, "ఒసే, సింగీ! వాళ్ళంతా పిచ్చి వాళ్ళులే. మనం దయ్యాలమని తెలీక, దొంగల మనుకుని హైరానపడుతున్నారు. మనం అసలిక్కడికి రావటమే పొరపాటే! ఈ బాపనయ్య ఇంట్లో మనం పీక్కుతినటానికి కోళ్ళూ లేవు, గొర్రెలూ లేవు. మళ్ళీ తెల్లవారుతుందేమో, చప్పున పెద్ద రెడ్డిగారింటికి పోదాం పద. అక్కడ బోలెడన్ని గొర్రె

లుంటాయి. కడుపారా మెక్కి, తెల్లవారే లోపుగా గూడు చేరుకోవచ్చు,'' అన్నాడు.

"సరే, మామా!" అన్నాడు మొదటి వాడు ఆడగొంతుతో.

ఇదంతా బయటి వాళ్ళు విని, "దయ్యాలురా, బాబూ, దయ్యాలు! పదండిరా, పదండి. చప్పున ఈ సంగతి పెద్ద రెడ్డిగారికి చెబుదాం. లేకపోతే ఆయన ఇల్లు చేరుకుంటాయి,'' అని ఒక్క పిట్ట మిగలకుండా అందరూ పెద్ద రెడ్డిగారింటి కేసి పరిగెత్తారు.

వాళ్ళు వెళ్ళిపోగానే దొంగలు మూట లను నెత్తిన పెట్టుకుని జారుకున్నారు.

జనం కోలాహలం విని పెద్ద రెడ్డిగారు భయపడుతూ లేచాడు.

"బాబోయ్, కొంప మునిగింది! దయ్యాలు పండితుడి ఇంటికి వచ్చి, అక్కణ్ణుంచి మీ ఇంటికి వచ్చాయి,'' అంటూ జరిగినదంతా చెప్పారు, జనం.

ఒకరూ ఇద్దరూ కాదు, అందరూ ఒకే మాట చెప్పటం చేత, పెద్ద రెడ్డి బెదిరి పోయి, గొర్రెల దొడ్డికి బలశాలులను కాపలా పెట్టించాడు; భూతమాంత్రికు లను పిలిపించాడు.

భూతవైద్యులు మంత్రాలు చదువుతూ, వేపమండలూ, చేటలూ, చీపిరి కట్టలూ ప్రయోగించారు. ఈవిధంగా తెల్లవారింది. మంత్రగాళ్ళు బహుమానాలు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

మర్నాడు పండితుడు సకుటుంబంగా తిరిగి వస్తూండగానే గ్రామస్థులు ఆయ నకు జరిగినదంతా చెప్పారు. కాని ఆయన ఇంట్లోకి వెళ్ళి చూసుకునేసరికి ఇంట్లో పూచికపుల్ల లేదు.

ఆయన కోపంతో, "మీ పిండాకూడు దయ్యాలు! ఇంత మందీ కలిసి నా యిల్లు దొంగలు దోచుకోనిచ్చారు. వాళ్లను తప్పించుకు పోనిచ్చారు!'' అని అందరినీ తిట్టిపోశాడు.

ఈ మాట తెలిసి పెద్దరెడ్డి, "అయ్యో, నిష్కారణంగా భూతవైద్యుల మొహాన డబ్బు పోస్తినే!'' అని విచారించాడు.



# వేటగాడి కొడుకు

ఒక వేటగాడికి ఒక కొడుకు ఉండేవాడు. వాడికి ఎప్పుడూ సందేహాలే.

ఒకనాడు తండ్రి కొడుకుతో, "ఒరే, నాయనా! ఇవాళ నాకు ఒంట్లో బాగాలేదు. నువు అడవికిపోయి, ఒక కుందేలునో, దుప్పినో కొట్టి పట్టుకురా," అన్నాడు.

కొడుకు వేటకు వెళ్లి, చాలాసేపు తిరిగాడు. కాని వాడికి ఏ జంతువూ కనిపించలేదు. చివరకు వాడు, దాహంవేసి, ఒక కొలను దగ్గిరికి వెళ్ళాడు. అక్కడ నీళ్ళు తాగుతూ ఒక కుందేలూ, దుప్పి వాడికి కనిపించాయి.

వెంటనే వాడు ఇంటికి పరిగెత్తుకుంటూ పచ్చి, "నాన్నా, నువు చెప్పిన కుందేలూ, దుప్పీ కూడా ఒక కొలనులో నీళ్ళు తాగుతున్నాయి. నీకు ఏది కావాలో చెప్పు, కొట్టితెస్తాను," అన్నాడు తండ్రితో.

"ఓరి తెలివి తక్కువ దద్దమ్మా! అవి ఇంకా అక్కడే నీ కోసం ఉంటాయా? నువు మళ్ళీ వెళ్లటం దండగే!" అని తండ్రి కొడుకు తెలివితక్కువకు విచారించాడు.

—చిన్నారి చిన్నికృష్ణ.





# మందమతి

ఒక ఊళ్ళో ఒక మందమతి ఉండేవాడు. వాడు బతుకు తెరువు కోసం ఒక బట్టల వర్తకుడి వద్ద పనికి కుదిరాడు. వాడు బట్టల వ్యాపారానికి సంబంధించిన కూలి పనులన్నీ చేస్తూ ఉండేవాడు.

ఒకనాడు మందమతి చెయ్యటానికి పని ఏమీ లేకపోయింది. వర్తకుడు వాడికి ఒక చిన్న తాను ఇచ్చి, "ఒరే, నువు దీన్ని తీసుకుపోయి అమ్ముకురా. లాభంలో నీకు వాటా ఇస్తాను," అన్నాడు. ఆ విధంగా మందమతికి వ్యాపారంలో మరింత ప్రవేశం కలుగుతుందని ఆయన ఉద్దేశం.

"దీన్ని ఎంతకు అమ్మమన్నారు?" అని మందమతి యజమానిని అడిగాడు.

వాడికి దాని ధర తెలుసు ననుకుని, "ఒక అణా అటూ, ఇటూగా అమ్మెయ్యి," అన్నాడు వర్తకుడు.

ఆ తాను పుచ్చుకుని మందమతి పెద్ద బజారుకు వెళ్ళి, ఒక చోట కూర్చున్నాడు. ఎవరన్నా దగ్గిరికి వచ్చి, "తాను ఎంతకిస్తున్నావు?" అని అడిగితే, వాడు, "అణా అటూ ఇటూ చేసి ఇస్తాను. అంతకన్న తగ్గేది లేదు," అంటూ వచ్చాడు. అదేదో హాస్యమనుకుని, కొనటానికి వచ్చిన వాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

ఇదంతా చూస్తున్న గడుసువాడు ఒకడు మందమతికి బుర్రలేదని కనిపెట్టి, రెండు చేతులలో రెండు అణాలు చూపించి, "ఆ తాను ఇచ్చెయ్యి," అన్నాడు. అణా అటూ అణా ఇటూ ఉన్నది గనుక, యజమాని చెప్పిన విధంగా బేరం కుదిరిందనుకుని మందమతి తానును ఆ మనిషికి ఇచ్చి, రెండణాలూ తీసుకున్నాడు.

పి. సుబ్బరాజు

మందమతికి ఆకలి దహించుకు పోతున్నది. వాడు తన వద్ద ఉన్న రెండణాలూ పెట్టి ఒక రొట్టె కొని, దాన్ని తిందామని ఒక చోట కూర్చున్నాడు. ఇంతలో ఎక్కడి నుంచో ఒక కుక్క వచ్చి, వాడి చేతిలో ఉన్న రొట్టెను కాస్తా లాగేసుకుని, అందకుండా పారిపోయింది.

ఆకలి దహించుకుపోతూ మందమతి వర్తకుడి దగ్గిరికి తిరిగి వెళ్ళి, "మీరు నాకు ఒక్క తానే ఇచ్చారు. ఏదో, ఇరవయ్యో ఇచ్చి ఉంటే, అలాగ్గా అన్నీ అమ్మేసి ఉందును," అన్నాడు.

"అమ్మిన తాను డబ్బు ఇచ్చెయ్యి. రేపు ఇంకా ఎక్కువ తానులు ఇస్తాను," అన్నాడు వర్తకుడు.

"తాను అమ్మిన డబ్బుపెట్టి రొట్టె కొనుక్కుంటే కుక్క ఎత్తుకుపోయింది. అందులో నేను, ప్రమాణ పూర్తిగా, ఒక్కనలుసైనా తినలేదు! ఆకలి దహించుకుపోతున్నది," అన్నాడు మందమతి.

వర్తకుడికి ఈ మాట విని పట్టరాని కోపం వచ్చింది. "ఏమిట్రా నీ వాగుడు? తాను డబ్బు తీసుకు రాకపోయావంటే చావగొట్టేస్తాను, జాగ్రత్త!" అని ఆయన మందమతి మీద అరిచాడు.

మందమతి తక్షణం అక్కడి నుంచి పారిపోయి, తన రొట్టెను ఎత్తుకుపోయిన



కుక్క కోసం వెతకసాగాడు. వెతకగా, వెతకగా అది ఒక మిఠాయిదుకాణం పక్కన ఎంగిలి ఆకులు నాకుతూ వాడి కంటపడింది.

మందమతి ఆ కుక్క మీదికి పరిగెత్తిపోయి, "నా డబ్బు నాకిచ్చెయ్యి!" అని కేకపెట్టాడు.

కుక్క వాణ్ణి చూసి భయపడి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తిపోయి, ఒక ధనికుడి ఇంట దూరింది. ముందూ, వెనకా చూడకుండా మందమతి తానుకూడా ఆ ఇంట ప్రవేశించాడు.

ఆ సమయంలో, ఇల్లుగల ధనికుడు, డబ్బులెక్కపెట్టి మూటలు కట్టి, ఇన

పెట్టెలో పేర్చుతున్నాడు. ఆయన ఒక్క క్షణంపాటు అవతలికి వెళ్లిన సమయంలో మందమతి లోపలికి వచ్చాడు. ఇనప్పెట్టె తెరిచే ఉన్నది. మందమతి ఒక డబ్బు సంచీ తీసుకుని, వెళ్ళిపోయి, వర్తకుడికి దాన్ని ఇచ్చాడు.

తానుకు చాలా మంచిధర వచ్చిందనుకుని వర్తకుడు ఎంతగానో సంతోషించి, మందమతికి కొంత డబ్బు ఇచ్చి పంపేశాడు.

ఈ లోపల ధనికుడు తన ఇంట దొంగతనం జరిగినట్టు కొత్వాలుకు ఫిర్యాదు చేశాడు. రక్షకభటులు కొన్ని ఆరాలు తీయగా అనుమానం మందమతి మీద నిలిచింది.

కొత్వాలు మందమతిని పిలిపించి, "నువు ఫలాని ధనికుడి ఇంట డబ్బు దొంగిలించావా?" అని అడిగాడు.

"అవునండి," అన్నాడు మందమతి.

"ఎప్పుడు దొంగిలించావు?" అని కొత్వాలు అడిగాడు.

"కుక్కను తరిమిన రోజున," అన్నాడు మందమతి.

"కుక్కను ఎప్పుడు తరిమావు?" అని కొత్వాలు మళ్ళీ అడిగాడు.

"డబ్బు దొంగిలించిన రోజున," అన్నాడు మందమతి.

కొత్వాలు ఏమీ తోచక, "మీ ఇల్లు ఎక్కడ?" అని అడిగాడు.

"బ్రాహ్మల ఇంటికి ఎదురుగా," అన్నాడు మందమతి.

"ఆ బ్రాహ్మల ఇల్లు ఎక్కడ?" అని కొత్వాలు అడిగాడు.

"మా యింటికి ఎదురుగా," అన్నాడు మందమతి.

"ఆ రెండు ఇళ్ళూ ఎక్కడ?" అని కొత్వాలు మళ్ళీ అడిగాడు.

"ఒకదానికొకటి ఎదురుగా," అన్నాడు మందమతి.

మందమతికి మతిలేదనీ, వాణ్ణి ప్రశ్నించటం వృథా అనీ కొత్వాలు తెలుసుకుని, వాణ్ణి పంపించేశాడు.



# 160. మేరుపర్వతం

ఉత్తర కురుప్రాంతం భూలోక స్వర్గమనీ, అది మానవులకు అజేయమనీ, అది హిమాలయాలకు అవల ఉన్నదని, అక్కడ నివసించిన వాళ్ళు పాపరహితులనీ, వారు భూమిని దున్నటం గాని, రథాలలో తిరగటం గాని ఎరగరనీ ఐతరేయ బ్రాహ్మణం, బౌద్ధమత గ్రంథాలు మొదలయిన ప్రాచీన రచనలలో ఉన్నది. అదే ఈ నాడు మనం "పామిర్" అనే ప్రాంతం. ఇటీవల కాలందాకా మానవులకు వశం కాకుండానే ఉండింది. సోవియట్ పరిపాలనలో ఇక్కడ నాగరికత పెంపొందుతూ వస్తున్నది, ఉద్యాన వనాలు వెలుస్తున్నాయి. విద్యుచ్ఛక్తి ప్రవహిస్తున్నది. తిరుపతి లాగే ఇది కూడా సప్తగిరి. దీనినే మన పూర్వులు మేరుపర్వతం అన్నారు.







# అపూర్వవస్తువు

పూర్వం విదర్భదేశాన్ని పాలించిన ఒక రాజు తనకు అపూర్వవస్తువు కానుక ఇచ్చిన వారికి ఏటా పదివేల బంగారు నాణాలు బహుమానం ఇచ్చేవాడు.

ప్రవరుడు అనే మంత్రవైద్యుడు ఆ రాజ్యంలో ఉండేవాడు. ఆయన చాలా కాలం కృషి చేసి ఒక అద్భుత రసాయనం తయారు చేశాడు. దాన్ని తాగుతూ ఎవరు ఏ రూపం తలుచుకుంటే ఆ రూపం పొందుతారు. అయితే అలాటి వాళ్ళకు యథారూపం కావాలంటే ఆ రసాయనానికి విరుగుడు వెయ్యాలి. ఆ విరుగుడు మందు తయారు చెయ్యటం వైద్యుడికి సాధ్యపడలేదు. అందుచేత ఆయన తన అద్భుత రసాయనాన్ని ఎవరిపైనా ప్రయోగించక, రాజుగారితో దాన్ని గురించి చెప్పి, ఒక సంవత్సరం రాజుగారి బహుమానం పొందటానికి ఆ రసాయనాన్ని ఒక గిన్నెలో పోసి తెచ్చి, రాజుగారికి చూపాడు.

ఆయన రాజుతో ఆ రసాయన ప్రభావం చెప్పి, "దీనికి విరుగుడు తయారు చెయ్యటానికి ఒక్క వస్తువు దొరకలేదు. అందు చేత దీన్ని ఇంతవరకు ప్రయోగించలేదు. తమరు దీన్ని ఈ యేడు అపూర్వవస్తువుగా పరిగణించి నాకు బహుమానం ఇప్పించితే నేను ధన్యుణ్ణి అవుతాను," అన్నాడు.

"దీన్ని పరీక్షించకుండా అపూర్వవస్తువని ఎలా తెలుసుకోవటం? నీ కొడుకు చేత తాగించి దీని ప్రభావం నిరూపించు," అన్నాడు రాజు. వైద్యుడి కొడుకును తీసుకు రమ్మని ఆయన భటుడితో అన్నాడు. వైద్యుడు వద్దని ఎంత లబలబలాడినా, మందు ప్రభావం చూడాలన్న కుతూహలంతో రాజు వినిపించుకోలేదు.

ఆర్. జగన్నాథశర్మ

వైద్యుడి కొడుకు పన్నెండేళ్ళవాడు వచ్చాడు. రాజు వాడితో, "నీకు పక్షి అయి ఎగరాలని ఉన్నదా? జింక అయి పరి గెత్తాలని ఉన్నదా? ఏనుగు కావాలని ఉన్నదా? ఏదో ఒకటి కోరుకుంటూ ఈ మందు తాగు," అన్నాడు.

వైద్యుడు, "వద్దు, వద్దు," అంటూ గిలగిలలాడాడు.

"ఎందుకు చింతిస్తావు? విరుగుడు మందు కనిపెట్టి నీ కొడుకుకు యథా రూపం కలిగించు. నీకు మరొక బహు మానం మళ్ళీ ఇస్తాను," అన్నాడు రాజు.

వైద్యుడి కొడుకు జింక రూపం తలుచు కుంటూ మందు తాగి, జింకగా మారి పోయాడు. వైద్యుడు వలవలా ఏడ్చాడు.

"ఎందుకు ఏడుస్తావు? బహుమానం తీసుకో. విరుగుడు మందు వెంటనే కని పెట్టు," అన్నాడు రాజు వైద్యుడితో.

"దానికి కావలిసిన ఒక వస్తువు దుర్లభం," అన్నాడు వైద్యుడు.

"ఏమిటా వస్తువు?" అన్నాడు రాజు.

"యాభైఏళ్ళు దాటి, రాజవంశంలో పుట్టినవాడి కుడి కన్ను కావాలి. అది దొరికితేనే గాని విరుగుడు మందు తయారు కాదు," అన్నాడు వైద్యుడు.

"అంతే గద? నా శత్రువైన కోసల రాజు యాభైఏళ్ళు మించినవాడే. నేను అతడి మీద దండెత్తిపోయి, అతణ్ణి చెర పట్టి, అతడి కుడి కన్ను పీకి ఇచ్చేస్తాను. తొందరపడకు!" అన్నాడు రాజు.



మంత్రవైద్యుడు దుఃఖిస్తూ, జింక అయిపోయిన తన కొడుకును తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. రాజుగారి సేవకులు బహుమానాన్ని ఆయన ఇంటికి చేర్చారు.

విదర్భరాజుకు కూడా పన్నెండేళ్ళ కొడుకున్నాడు. అతనూ, వైద్యుడి కొడుకూ ఒకే గురువు దగ్గిర చదువుకుని, గాఢ స్నేహితులుగా ఉండేవాళ్ళు.

ఒక రోజు రాజు కొడుకు తన మిత్రుడి కోసం వైద్యుడి ఇంటికి వెళ్ళినప్పుడు వైద్యుడు, "దిక్కుమాలిన ఈ మందుతో నేను వంశనాశనం తెచ్చి పెట్టుకున్నాను," అంటూ రాజకుమారుడికి మందు చూపాడు.

రాజుకొడుకు తాను కూడా జింక అయిపోయి తన మిత్రుడితో సమానం కావాలని తీవ్రమైన కోరిక కలిగి, అలాగే కోరుకుంటూ ఆ రసాయనం కాస్త తాగాడు. వెంటనే అతనికి కూడా జింక రూపం వచ్చేసింది. అతనితో వచ్చిన సేవకులు జింకను వెంటపెట్టుకుని రాజు వద్దకు తిరిగివెళ్ళారు.

తన కొడుకు కూడా జింక అయిపోయే సరికి రాజుకు మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. ఆయన ప్రగల్భాలు పలికాడే గాని, కోసలరాజును జయించే శక్తి ఆయనకు లేదు. కోసలరాజును పట్టుకోవటం కాదు గదా, యుద్ధంలో ఎదిరించే శక్తి కూడా విదర్భరాజుకు లేదు.

వైద్యుడి కొడుకు జింకగా మారితే రాజుకు ఏమంత బాధ అనిపించలేదు గాని, తన కొడుకే అలా అయేసరికి, విరుగుడు మందు కోసం తాను తొందర పడవలిసి వచ్చింది. విదర్భ రాజు, తనకు కూడా యాభై దాటాయి గనక, తన కుడి కన్ను వైద్యుడికి పీకి ఇచ్చాడు.

విరుగుడు మందు తయారయింది. రాజు కొడుకూ, వైద్యుడి కొడుకూ తిరిగి మామూలు రూపు పొందారు. ప్రగల్భాలు పలికినందుకు రాజు మాత్రం ఒంటి కన్నువాడయాడు.






# విలువలు

శ్రీకృష్ణదేవరాయలు సాహిత్య ప్రియుడు. దేశంలోని పండితులను, కవులను ఆదరించేవాడు. అనేకమంది తమ పాండిత్యాన్ని రాయల ఎదుట ప్రదర్శించి బహుమానాలు పొందేవారు.

రాయలవారి రాజధాని విజయనగరంలో రామశర్మ అనే ఒక సామాన్య పండితుడుండేవాడు. అతనికి చెప్పుకోదగ్గ పాండిత్యం లేదు. కానీ ఏదో విధంగా రాయలవారి వద్ద పెద్ద బహుమానం పొందాలని ఆశపుట్టింది. అందుకని శ్రమపడి కొన్ని పద్యాలను ఛందస్సు లోపం లేకుండా రచించి రాయలవారి ఆస్థానానికి వెళ్లాడు. రాయలవారి ఎదుట తాను ఒక గొప్ప పండితుడూ, కవీ అని చెప్పుకొని తాను రచించిన పద్యాలను చదివాడు.

రాయలు తానూ గొప్ప కవీ, విద్వాంసుడూ అవటంవల్ల రామశర్మ పద్యాలలో ఏమి స్వారస్యం లేకపోయినా, పాపం పేద పండితుడుగదా అని స్వల్పమైన బహుమానం ఇచ్చి పంపమని ఆదేశించాడు.

చాలా స్వల్పమైన బహుమానం ఇచ్చినందుకు రామశర్మకు రాయలపైన ఆగ్రహం వచ్చింది. శ్రీకృష్ణదేవరాయలు పక్షపాతి అనీ, తన పద్యాలకూ, ఎక్కువ బహుమానం పొందిన పండితుల పద్యాలకూ తేడా ఏమిటీ, ఏ పద్యమైనా పద్యమే కదా అని నిందించి వెళ్ళిపోయాడు.

రాయలవారి మనస్సుకు బాధ కలిగింది. ఆ సమయంలో అక్కడే వున్న తిమ్మరసు మహామంత్రి రాయలవారికి ఏదో రహస్యంగా చెప్పాడు.

మరుసటి రోజు, రామశర్మ ఇంటిలో వుండగా, పట్టుచీరల వర్తకులు ఇద్దరు వచ్చి, "మంచి చీరలున్నాయి, కొంటారా?" అని అడిగారు.

కోలార్ కృష్ణఅయ్యర్

రామశర్మ భార్య పట్టుచీర కొనాలని ఎప్పట్నుంచో అనుకొంటున్నది. చీరల వర్తకులను లోపలికి పిలిచి చీరలను చూచారు. అందులో ఒక పసుపు రంగు చీర రామశర్మ భార్యకు నచ్చింది. కానీ రామశర్మకు గులాబీ రంగుచీర ఒకటి నచ్చింది. చూడ్డానికి గులాబీ రంగుచీరే బాగుంది. రామశర్మ వాటి రెండింటి వెలలను అడిగాడు.

ఏ చీరైనా వంద నాణ్యాలేనని వర్తకులు చెప్పారు.

రామశర్మకు ఆశ్చర్యం వేసింది. అతడు గులాబీ రంగు చీర వెల ఎక్కువై వుంటుందని అనుకొన్నాడు.

కానీ రామశర్మ భార్య భర్తతో, "ఈ వర్తకులు మోసం చేస్తున్నారు. పసుపు రంగు చీర అసలైన పట్టుతో నేసినది. గులాబీ రంగు చీర నారపట్టుతో నేసినది. చీరల సంగతి మీకేం తెలుసు?" అంది.

వెంటనే రామశర్మ వర్తకులను, "ఇదేమిటండీ అన్యాయం? అసలు పట్టు చీర వెలా, నారపట్టు చీర వెలా, ఒకటేనా?" అని అడిగాడు.

అందుకు ఆ వర్తకులు, "రామశర్మగారూ! నిన్ననే కదా మీరు రాయలవారి ఆస్థానంలో ఏ పద్యమైనా పద్యమే కదా, బహుమానాలలో తేడా ఏమిటీ అని రాయలవారిని నిందించారు? అలాగే ఏ చీరైనా చీరే కదా, వాటి ధరల్లో తేడా ఎలా వుంటుంది?" అన్నారు.

రామశర్మకు ముందురోజు రాయల ఎదుట తన ప్రవర్తన పట్ల సిగ్గు వేసింది. ఈ వర్తకులకు ఈ విషయం ఎలా తెలిసిందని ఆశ్చర్యపడుతూంటే, రాయలవారూ, తిమ్మరసు మంత్రీ తమ నిజస్వరూపాలను బయట పెట్టారు. వెంటనే రామశర్మ రాయల కాళ్లపై పడి నమస్కరించి, క్షమాపణ కోరాడు. విశాల హృదయుడైన రాయలవారు అసలైన పట్టు చీరను రామశర్మ భార్యకు ఉచితంగా బహూకరించి, నవ్వుతూ తిమ్మరసుతో వెళ్ళిపోయాడు.






రాముడు చెప్పిన ప్రకారం లక్ష్మణుడు కిష్కింధకు బయలుదేరి వెళ్ళాడు. అతను భుజానికి విల్లు తగిలించుకుని, సుగ్రీవుడి ఇంటికి పోతూ, తాను సుగ్రీవుడితో ఏమనాలో, దానికి సుగ్రీవుడేమంటాడో, అందుకు తాను ఏమి బదులు చెప్పాలో ఆలోచించుకున్నాడు. లోపల అతనికి చాలా కోపంగా ఉన్నది.

లక్ష్మణుణ్ణి దూరాన చూసి వానరులు, ఎవరో శత్రువు వస్తున్నాడనుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధానికి సిద్ధమయారు. దీని మూలంగా లక్ష్మణుడి కోపం మరింత అయింది. అతని ముఖంలో కోపం తాండవించటం చూసి, వానరులు భయపడి, సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, లక్ష్మణుడు వస్తున్నట్టు చెప్పారు. కాని సుగ్రీవుడు తారతో సరసాలాడుతూ వాళ్ళు చెప్పినది వినిపించుకోలేదు.

అంగదుడు మాత్రం భయం భయంగా లక్ష్మణుడికి ఎదురు వెళ్ళాడు. లక్ష్మణుడు అతనితో, "అబ్బాయీ, నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు. మా అన్న చాలా దుఃఖంలో ఉండటం మూలాన నేను వచ్చానని చెప్పు; వెంటనే నా దగ్గరకు వచ్చి, నేను చెప్పేది వినమను," అన్నాడు.

అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, లక్ష్మణుడు మాట్లాడటానికి వచ్చాడనీ, చాలా కోపంగా ఉన్నాడనీ చెప్పాడు. అది విని సుగ్రీవుడు తన మంత్రులతో,

## 7. సుగ్రీవుడి సహాయం



"నేను ఏమీ పొరపాటు మాట అనలేదు; తప్పు పని చెయ్యలేదు. లక్ష్మణుడికి నా పైన కోపం ఎందుకు కలిగి ఉంటుంది? నా శత్రువులు నా మీద అతనికి ఏదో చాడీలు చెప్పి ఉంటారు. నేను భయపడుతున్నాననుకోకండి. నాకు రాముడన్నా, లక్ష్మణుడన్నా ఏమీ భయం లేదు. కాకపోతే, స్నేహితులైన వాళ్ళకు నిష్కారణంగా కోపం వస్తే ఎవరికైనా కొంచెం బాధగానే ఉంటుంది. నాకు భయమల్లా దేనికంటే, రాముడు నాకు చేసిన ఉపకారానికి తగిన ప్రత్యుపకారం చెయ్యలేనే అని. ఇది నాకు విచారం కలిగిస్తున్నది," అన్నాడు.

అప్పుడు బుద్ధిమంతుడైన హనుమంతుడు మిగిలిన మంత్రుల సమక్షంలో సుగ్రీవుడితో, "రాజా, నువు రాముడి మేలు మరవక పోవటం సహజమే. ఏమరుపాటులో నువు కాలగతి గమనించ లేదు. శరదృతువు వచ్చేసింది. యుద్ధ ప్రయత్నాలకు ఇదే సమయం. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. భార్యను పోగొట్టుకున్న దుఃఖంలో రాముడు లక్ష్మణుడి చేత కటువుగా మాట్లాడించినప్పటికీ నువు సహించాలి. కర్తవ్యం మరచి అపచారం చేశావు గనక, లక్ష్మణుణ్ణి మంచి చేసుకోవటం తప్ప మరొక మార్గం ఉన్నట్టు నాకు తోచదు. మంత్రిగా నీ హితం కోరి చెప్పాను. నువు నీ కొడుకునూ, బంధువర్గాన్నీ వెంట బెట్టుకుని లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, వినయంగా నమస్కరించి, అతను చెప్పినట్టు చెయ్యి. అప్పుడు లక్ష్మణుడి కోపం తప్పక చల్లారిపోతుంది," అన్నాడు.

అంగదుడు లక్ష్మణుణ్ణి తీసుకు వచ్చాడు. లక్ష్మణుడు కిష్కింధలో వానర ప్రముఖుల ఇళ్ళన్నీ చూస్తూ, సుగ్రీవుడి గృహం ప్రవేశించాడు. ఆ ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. సుగ్రీవుడి అంతఃపురంలో వీణావాద్యం వినబడుతున్నది. అమిత సౌందర్యవతులైన స్త్రీలు



అనేకమంది ఉన్నారు. సుగ్రీవుడు గొప్ప భోగపురుషుడిలాగా జీవిస్తున్నట్టు స్పష్ట మయింది. లక్ష్మణుడు పట్టరాని కోపంతో, తన వింటి నారి లాగి పెద్ద ధ్వని చేశాడు.

ఆ ధ్వని వినగానే సుగ్రీవుడికి లక్ష్మణుడు వచ్చినట్టు తెలియటమేగాక గుండె కూడా దడదడలాడింది. నోరు ఎండుకు పోయింది. అతను తారతో, "తారా, ఈ లక్ష్మణుడు చాలా మెత్తనివాడు గదా, అతనికి ఇప్పుడు కోపం ఎందుకు వచ్చిందంటావు? నేను ఇతనికి చెయ్యరాని పని ఏదన్నా చేశానా? ఎందుకైనా మంచిది, నువు ముందు వెళ్ళి, అతన్ని ప్రసన్నుణ్ణి చెయ్యి. తరవాత నేను వస్తాను," అన్నాడు.

తార లక్ష్మణుడి వద్దకు వచ్చింది. తాగిన మత్తు కూడా పూర్తిగా వదలక, అప్పుడే పక్క మీది నుంచి లేచి వచ్చి నట్టు కనబడుతున్న తారను చూసి లక్ష్మణుడు తలవంచుకున్నాడు.

తార అతనితో, "లక్ష్మణా, నీకు కోపం తెప్పించిన వారు ఎవరు? అంత సాహసం ఎవరికి కలిగింది?" అన్నది.

"భర్తహితం కోరే దానివి, నీకు తెలీదా? నీ భర్త ఎప్పుడూ తాగుతూ, స్త్రీలోలుడై, ధర్మార్థాలను పూర్తిగా మరిచాడు. ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యకపోవటం ధర్మానికి, అర్థానికీ చేటు కాదా? మమ్మల్ని ఇలా ఉపేక్ష చేస్తే మేం ఏం చెయ్యాలో నువే చెప్పు," అన్నాడు లక్ష్మణుడు తారతో.

దానికి తార, "లక్ష్మణా, స్నేహితుడైన సుగ్రీవుడి మీద ఇంతగా అలగ వచ్చునా? అతనికి మీ పని చూడాలనే ఉన్నది. కొంచెం జాప్యం చేశాడు. నీ వంటి మహాపురుషుడు అల్పుడి మీద ఆగ్రహించరాదు. అతను మీ పని చూడటంలో ఏమరుపాటుగా ఉండటానికి నేను పక్కన ఉండటమే కారణం. నువు సుగ్రీవుణ్ణి క్షమించు. మహామహా రుషులే

ఆడదానికి లొంగిపోతుంటే, ఈ సుగ్రీవు డెంత?" అన్నది.

ఆమె లక్ష్మణుణ్ణి లోపలికి తీసుకు పోయింది. సుగ్రీవుడు మహావైభవంగా ఆభరణాలూ, పుష్పమాలలూ ధరించి వెలిగిపోతూ బంగారు సింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతని చుట్టూ అనేక మంది అప్సరసలలాటి స్త్రీలున్నారు. సుగ్రీవుడు రుమను కౌగలించుకుని ఉన్నాడు. ఆ దృశ్యం చూస్తూనే లక్ష్మణుడు మహా కోపంతో కాలరుద్రుడిలాగా అయిపోయాడు.



లక్ష్మణుణ్ణి చూడగానే సుగ్రీవుడు భయపడి ఆసనం దిగి, కింద నిలబడ్డాడు. అతనితోబాటు స్త్రీలందరూ లేచి నిలుచున్నారు.

తనకు నమస్కారం చేస్తూ తల వంచుకుని నిలబడిన సుగ్రీవుడితో లక్ష్మణుడు ఇలా అన్నాడు:

"రాముడి చేత నీ పని తీరిపోయినాక నువు రాముడి పని చూడవద్దా? కృతఘ్నుడివి, అసత్యవాదివి! సీత కోసం ఎందుకు వెదికించావు కావు? తప్ప తాగి ఆడవాళ్ళతో ఎందుకు కులుకుతున్నావు? నీవు ఇలాటి వాడివని తెలిస్తే రాముడు నిన్ను వానరరాజుగా చేస్తాడా? నిన్ను నా బాణాలతో వాలి దగ్గిరికి పంపేస్తాను."

తార మళ్ళీ సుగ్రీవుణ్ణి సమర్థిస్తూ, "లక్ష్మణా, సుగ్రీవుడు ద్రోహీ, దుర్మార్గుడూ, కృతఘ్నుడూ కాడు. చాలాకాలం అనేక కష్టాలకోర్చి అతను ఇప్పుడు సుఖలాలసలో ఉంటే, మిత్రుడివైన నువు క్షమించవచ్చు. రాముడి కోసం సుగ్రీవుడు నన్నూ, రుమనూ, తన సమస్తాన్నీ వదిలిపెట్టగలడు. సీతను రాముడికి తెచ్చి ఇయ్యగలడు. అందుకై రావణుడితో యుద్ధం చెయ్యగలడు. మీ పని మీదనే అతను వానరులకందరికీ కబురు చేసి ఉన్నాడు. వాళ్ళు రావలసి ఉన్నది. ఇవాళే వాళ్ళు వచ్చే రోజు. అందుచేత నువు కోపం మాని శాంతించు." అన్నది.



ఈ మాటలతో లక్ష్మణుడు మెత్తబడ్డాడు. అది చూసి మనసు స్థిమితపడి, సుగ్రీవుడు లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా వల్ల కొంచెం జాప్యం జరిగి ఉంటే క్షమించు. లోకంలో తప్పు చెయ్యని వాడెవడు?" అన్నాడు.

లక్ష్మణుడు అతన్ని మెచ్చుకుంటూ, "రావణుడితో యుద్ధం చెయ్యటానికి నీ సహాయం ఉంటే అంతకన్న మాకు కావలసినదేమిటి? నువు ఇప్పుడే నా వెంట వచ్చి, భార్య కోసం తపిస్తున్న రాముణ్ణి ఓదార్చు," అన్నాడు.

సుగ్రీవుడు తన పక్కనే ఉన్న హనుమంతుడితో ఇలా అన్నాడు:

"ప్రపంచంలో ఉండే వానరులనందరినీ పిలవటానికి దూతలను పంపించు. నేను ముందు పంపిన దూతలను తొందర పెట్టించు. వెళ్ళటానికి బద్ధకించే సోమరిపోతులను నా వద్దకు పంపు. పది రోజుల లోపల ఇక్కడ చేరని వానరులకు మరణ దండన ప్రకటించు."

హనుమంతుడు సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం కిష్కింధలో ఉండే వానరులనందరినీ అన్ని దిక్కులకూ పంపించాడు.

సుగ్రీవుడు ఒక బంగారు పల్లకి తెప్పించి, అందులో తనతోబాటు లక్ష్మణుణ్ణి ఎక్కించుకుని, వానర పరివారాన్ని వెంటబెట్టుకుని, మహా వైభవంగా రాముడున్న చోటికి వచ్చాడు. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకీ దిగి, చేతులు మోడ్చి నిలబడ్డాడు. తరవాత అతను తన కాళ్ళకు సాష్టాంగపడితే, రాముడు అతన్ని ప్రేమగా లేవనెత్తి అలింగనం చేసుకున్నాడు. తరవాత అందరూ కూర్చున్నారు.

రాముడు సుగ్రీవుడికి, యుద్ధకాలం ఆసన్నమయిందని జ్ఞాపకం చేశాడు.

"రామా, వీరాధివీరులైన వానరులు కోట్ల సంఖ్యలో నీకు సహాయపడటానికి వస్తున్నారు. రావణుణ్ణి సకుటుంబంగా

చంపి సీతను వాళ్ళు నీకు అప్పగిస్తారు." అన్నాడు సుగ్రీవుడు.

తన కోసం సుగ్రీవుడు సాగించిన చర్యలు తెలుసుకుని రాముడు సంతో షించాడు.

"సుగ్రీవా, నీ సహాయంతో నేను తప్పక శత్రువును చంపగలను." అని రాముడు అన్నాడు.

ఇదే సమయంలో ఆకాశంలో చాలా ఎత్తుకు ధూళి లేచింది. వానరమూకలు వచ్చి చేరుతున్నాయి. నదీతీరాలలోనూ, సముద్రతీరానా, కొండలలోనూ నివసించే వానరులు కోట్ల సంఖ్యలో వస్తున్నారు. కొందరు ఎర్రగా ఉన్నారు, కొందరు తెల్లగా ఉన్నారు, కొందరు బూడిద రంగులో ఉన్నారు. అలాటి వానరులను వెంటబెట్టుకుని శతవలి అనే వానర శ్రేష్ఠుడు వచ్చాడు. బంగారు వర్ణం గల మహా వీరుడు సుషేణుడు, తారతండ్రి, కొన్ని కోట్ల వానరులతో వచ్చాడు. అలాగే రుమ తండ్రి తారుడు కూడా వచ్చాడు. ఇరవైరెండువేల వానరులతో హనుమం తుడి తండ్రి కేసరి వచ్చాడు. గవాక్షుడూ, ధూమ్రుడూ వానర, భల్లూక సేనలతో వచ్చారు. నీలుడు నల్లటి వానరుల సేనతో వచ్చాడు. గవయుడు కొన్ని కోట్ల వానరు లను తెచ్చాడు. దరీముఖుడూ, మైంద,



ద్వివిదులూ, గజుడూ అసంఖ్యాకులైన వానరులను తెచ్చారు. జాంబవంతుడు పది కోట్ల భల్లూక యోధులను తెచ్చాడు. గంధమాదనుడూ, అంగదుడూ కూడా గొప్ప సంఖ్య గల వానరులను వెంట బెట్టుకు వచ్చారు. మొత్తం మీద ప్రపం చంలో గల వానర యోధులందరూ కిష్కింధ చేరారు. వాళ్ళ కోలాహలం మిన్నుముట్టింది.

వానర ముఖ్యులందరూ సుగ్రీవుణ్ణి చేరుకుని నమస్కరించారు. సుగ్రీవుడు వారిని రాముడికి సమర్పించి, వాళ్ళతో, "మీరు మీమీ సేనలను సెలయేళ్ళ సమీపంలోనూ, వనాలలోనూ విడియించి,

వాటి మంచి చెడ్డలు తెలుసుకుంటూ ఉండండి,'' అన్నాడు.

అతను రాముడితో, ''నువు చెప్పి నట్టు చెయ్యటానికి వానరులు కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారిలో కామ రూపులూ, పర్వతకాయులూ, కామ గమనం గలవారూ, భయంకర పరా క్రములూ ఉన్నారు. వారిని నీ యిష్టం వచ్చినట్టు ఆజ్ఞాపించు. ఈ వానర వీరులు ఏం చెయ్యాలో నాకు తెలుసు. అయినా వారిని నువే ఆజ్ఞాపించు,'' అన్నాడు.

రాముడు సంతోషంతో సుగ్రీవుణ్ణి కౌగ లించుకుని, ''సుగ్రీవుడా, సీత బతికి ఉన్నదా, లేదా? రావణుడు ఎక్కడ ఉంటాడు? ఈ సంగతులు తెలియాలి. సీత బతికి ఉన్నట్టు తెలిస్తే, ఆ తరవాత ఏం చెయ్యాలో అది మనిద్దరమూ చేద్దాం. అందుచేత నా కోరికకు తగినట్టుగా నువే వానరులను ఆజ్ఞాపించు,'' అన్నాడు.

సుగ్రీవుడు వినతుడు అనేవాణ్ణి, పర్వతాకారుణ్ణి, పిలిచి, అతన్ని ఒక లక్ష వానరులను వెంటబెట్టుకుని తూర్పుగా వెళ్ళమన్నాడు; అక్కడ రావణుడు ఉండే ప్రదేశం కోసమూ, సీత కోసమూ వెదకమన్నాడు; వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం గడువు ఇచ్చాడు.

అలాగే సుగ్రీవుడు దక్షిణంగా కొందరు వానరులను పంపాడు. దక్షిణంగా వెళ్లే వారిలో నీలుడూ, హనుమంతుడూ, జాంబ వంతుడూ, సుహోత్రుడూ, శరారీ, శర గుల్మడూ, గజుడూ, గవాక్షుడూ, గవ యుడూ, ఋషభుడూ, మైందుడూ, ద్వివిదుడూ, విజయుడూ, గంధమాద నుడూ, ఉల్కాముఖుడూ, అనంగుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళున్నారు. వారి వెంట విస్తారమైన వానర సైన్యం కూడా ఉన్నది.

తరవాత సుగ్రీవుడు తార తండ్రి అయిన సుషేణుణ్ణి, అనేకమంది వానర వీరులతో సహా పడమటి దిక్కుకూ, శత వలిని లక్షమంది వానర వీరులతో సహా ఉత్తరానికీ పంపాడు.






న కర్తా కశ్యచి, త్కశ్చి
న్నియోగే చాపి నేశ్వరః.
స్వభావే వర్తతే లోకః,
తస్య కాలః పరాయణమ్. 1

[ఎవడూ దేనికీ కర్తకాడు, ఎవడూ ఎవణ్ణీ ప్రేరేపించే సమర్థుడు కాడు. లోకం స్వభావాన్ని అనుసరించి నడుస్తుంది. దానికి ప్రధానం కాలం.]

న కాలః కాల మత్యేతి.
న కాలః పరిహీయతే,
స్వభావం చ సమాసాద్య
న కశ్చి దతివర్తతే. 2

[కాలం స్వతంత్రమైనది, అది దేనికీ లోబడదు. ఎవడూ దానిని అతిక్రమించలేడు.]

న కాలస్యాస్తి బంధుత్వం,
న హేతుర్న పరాక్రమః,
న మిత్రజ్ఞాతిసంబంధః,
కారణం నాత్మనో వశః. 3

[కాలానికి బంధుత్వం లేదు. పరాక్రమమూ, మిత్ర, జ్ఞాతి సంబంధమూ అది పాటించదు. అది స్వతంత్రమైనది.]

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మాత కాని ఆడది

పంపినవారు :
మొహియొద్దీన్ అహమ్మద్

Photo by Devidas Kasbekar



కోరుట్ల.
(కరీంనగర్ జిల్లా)

మమత చూపిస్తున్నది

బహుమతి
పొందిన వ్యాఖ్య

V11

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు ఏప్రిల్ 20 వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూన్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
రబ్బరుబొమ్మ

మూడవ అట్ట:
ఆకులబొమ్మ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications...

మధురమైనది ! పుష్టికరమైనది ! ఎక్కువ మాంసకృత్తులు వున్న మోడర్న్ పీనట్ బట్టర్. దాన్ని స్యాండ్‌విచ్‌లు, ప్యాన్ కేక్‌లు, దోసెలు పరాఠాల మీద రాసితినండి, సూపులు, సేవరీలు, కేక్‌లు మరియు పులావులకు అమోఘమైన రుచిని పప్పుసువాసనను కూడా మోడర్న్ పీనట్ బట్టర్ కలగ చేస్తుంది. మోడర్న్ పీనట్ బట్టర్‌ను




క్రొత్త క్రొత్త ఊహలతో అనేకరకాలగా వుపయోగించండి. అయితే మోడర్న్ పీనట్ బట్టర్ వండేందుకు వుపయోగించే పదార్థం కాదని మాత్రం గుర్తుంచుకోండి.

ఉచితం ! ఆహార తయారీ కరపత్రం, మీ ప్రతికోసం ఈదిగువ ఎడ్రస్‌కు వ్రాయండి :



మోడర్న్ బేకరీస్
(ఇండియా) లిమిటెడ్.
(భారత ప్రభుత్వ వ్యవస్థ),
25బి, లోకల్ షాపింగ్ సెంటర్,
వసంత్ విహార్, న్యూ ఢిల్లీ 110057.

# మమ్మీ మమ్మీ మోడర్న్ పీనట్ బట్టర్

U-MBI-3 TEL



1x

ఏ.వి.యం.శేఖర్ సమర్పించు

మారుతీ ప్రొడక్షన్స్

# బాబు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు బి.ఎ.

నిర్మాత: ఏ.యల్. కుమార్ బి.ఇ.








# సమయోచిత సందర్భాన్ని చెప్పండి
# రూ 50,000 లు విలువచేసే
# బహుమతులు గెలవండి

## ప్యారీవారి "సమయోచిత సందర్భాన్ని చెప్పండి" పోటీలో

**2** మొదటి బహుమానాలు — మీా ఇష్టమువచ్చిన ఆభరణాలసమితి ఒక్కొక్కటి — విలువ రూ. **10,000/-**.

**2** రెండవ బహుమానాలు రెఫ్రిజిరేటరుగాని వంట సరంజామాుగాని ఒక్కొక్కటి — విలువ రూ. **5,000/-**

**50** కన్సోలేషన్ బహుమానాలు — కాంచీపురము చీరలు ఒక్కొక్కటి — విలువ రూ. **400/-**.

మీాకు దగ్గరలోనున్న డీలరువద్ద పూర్తి వివరములతోగల ఎంట్రీ ఫారములు లభిస్తాయి.







ప్యారీవారి "పిక్ ద బ్లాక్" ఈ అందమైన డబ్బాలో మీరు అభిలషించే మిఠాయిలు 6 రంగులలో లభిస్తాయి గ్రా 450లు వెల రూ 12/-లు మాత్రమే.

**త్వరపడండి! పోటీ ముగింపు తేది 15 జూన్ 1975**

ప్యారీస్
కన్ఫెక్షనరీ లిమిటెడ్
మద్రాసు.

SAA/PRS/1665



